# వీక్షణం

*veekshanam fortnightly*

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 19 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | సెప్టెంబర్ 1-15, 2004




లోపలి పేజీల్లో...




విడి ప్రతి: రూ॥ 6/-

వార్షిక చందా:రూ॥140/-లు


సంపాదకీయం:

## సాంఘిక న్యాయం దిశగా....

రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన ముస్లిం రిజర్వేషన్లు, కేంద్ర ప్రభుత్వ ఆలోచనలో ఉన్న ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు తీవ్రమైన చర్చను రేకెత్తిస్తున్నాయి. అసలు రిజర్వేషన్లనే వ్యతిరేకించేవారి దగ్గరనుంచి రిజర్వేషన్లు కొన్ని పరిమితులకు లోబడి ఉండాలనే వారి వరకు ఎంతోమంది ఈ రెండు అంశాలపై తమ భిన్నాభిప్రాయాన్ని ప్రకటిస్తూ, వివాదాలకు దారి తీస్తున్నారు.

నిజానికి ఈ రెండు రిజర్వేషన్లూ సమాంజంలోని రెండు అత్యవసరమైన పరిష్కారాలు:గా ముందుకొస్తున్నాయి. హిందూ మతోన్మాదం, ప్రపంచీకరణ విధానాలు గత ఒకటిన్నర దశాబ్దాలుగా భారత సమాజాన్ని అల్లకల్లోలం చేసిన నేపథ్యంలో ఈ రిజర్వేషన్లు ఒక చారిత్రక అవసరం. బాబ్రీమసీదు విధ్వంసం నుంచి గుజరాత్ మరణకాండ దాకా ఈ దేశంలో ముస్లింల అస్తిత్వమే ప్రశ్నార్థకమై, ముస్లింలు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని రెండో తరగతి పౌరులుగా బిక్కుబిక్కుమంటూ గడుపుతున్నప్పడు, వారి ఆందోళన, భయోద్వేగం హింసాయుత మార్గాలు చేపట్టకుండా చూడాలంటే, వారికి ఇక్కడ రక్షణ ఉందని, భయంలో బతకనవసరం లేదని, అభివృద్ధి అవకాశాలున్నాయనీ హామీ ఇవ్వవలసి ఉంటుంది.

ఆ హామీ కన్న ముఖ్యంగా, రాష్ట్ర మైనారిటీల కమీషనరేట్ చేసిన అధ్యయనం రాష్ట్రంలో ముస్లింల జీవనస్థితి ఎంత దారుణంగా ఉన్నదో చూపింది. కేవలం 18 శాతం అక్షరాస్యతతో, ఉద్యోగాలలో అతి తక్కువ ప్రాతినిధ్యంతో, 65 శాతం దారిద్ర్యరేఖకు దిగువన బతుకుతూ ముస్లింలు సంక్షేమరాజ్య రక్షణలు అందవలసిన స్థితిలో ఉన్నారు. అందువల్ల ముస్లింలకు విద్య, ఉద్యోగాలలో రక్షణలు కల్పించడం న్యాయబద్ధమైన, రాజ్యాంగ బద్ధమైన చర్య.

అదే విధంగా, ప్రైవేటురంగంలో రిజర్వేషన్ల అమలును దళిత, ఆదివాసి, వెనుకబడిన వర్గాలు ఎప్పటి నుంచో ముందుకు తెస్తున్నాయి. ప్రపంచీకరణ వల్ల ప్రభుత్వరంగం తగ్గిపోతూ, అన్ని పారిశ్రామిక, సేవారంగాలలో ప్రైవేటు పెట్టుబడి విస్తరిస్తున్నప్పడు ఆ మేరకు రిజర్వేషన్ల అమలు తగ్గిపోతూ రాజ్యాంగ స్ఫూర్తికే విఘాతం కలిగింది. అభివృద్ధినీ, సాంఘిక న్యాయాన్నీ సమదృష్టితో చూస్తాననే ప్రభుత్వం ఆ రెంటికీ పోటీ ఏర్పడుతున్న నేటి స్థితిలో తగిన చర్యలు తీసుకోవాలి. పదిహేను సంవత్సరాల ప్రపంచీకరణ క్రమంలో ప్రభుత్వరంగంలో ఉద్యోగ కల్పన తగ్గిపోయిందనీ, ప్రైవేటురంగ ఉద్యోగ కల్పనలో సాంఘికన్యాయం పాటించబడలేదనీ ప్రభుత్వం ఇప్పటికైనా గుర్తించి దాన్ని సవరించే ఆలోచనలు ప్రారంభించడం ఆహ్వానించదగినది.

ఈ రెండు అభ్యుదయ విధానాలను సమర్థించి, బలపరచడం ప్రజాస్వామిక వాదుల కర్తవ్యం.


వచ్చే సంచిక ఫోకస్: భూసంస్కరణలు

# "వ్యవసాయరంగానికి ఉచిత విద్యుత్"

-యం. తిమ్మారెడ్డి
పీపుల్స్ మానిటరింగ్ గ్రూప్ ఆన్
ఎలక్ట్రిసిటి రెగ్యులేషన్

గడిచిన సార్వత్రిక ఎన్నికల సందర్భంగా కాంగ్రెస్ పార్టీ చేసిన ఎన్నికల వాగ్దానాలలో "వ్యవసాయ రంగానికి ఉచిత విద్యుత్" కు ఒక ముఖ్యమైన స్థానం వుంది. కాంగ్రెస్ పార్టీ రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో గెలిచిన తరువాత ప్రభుత్వ పగ్గాలు చేపట్టిన నూతన ముఖ్యమంత్రి శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి సంతకం చేసిన మొదటి ఫైలు వ్యవసాయ రంగానికి ఉచిత విద్యుత్‌కు సంబంధించినది. దీనితో కాంగ్రెస్ పార్టీ ఈ వాగ్దానానికి ఇచ్చిన ప్రాముఖ్యత స్పష్టమవుతుంది. వాగ్దానంచేసి దానిని నెరవేర్చడానికి సంతకమైతే చేసింది కాని పరిణామాల గురించి, పర్యవసానం గురించి కాంగ్రెస్‌పార్టీకి అవగాహన లేదు. ఇతరులెవరైనా చెప్పినా వినే పరిస్థితిలో లేదు.

ప్రస్తుత రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో, ప్రత్యేకించి వ్యవసాయరంగంలో బావుల క్రింది వ్యవసాయానికి కీలకమైన పాత్రవుంది. ఈ మొత్తం బావులలో 95 శాతానికి విద్యుత్ కనెక్షన్లు (అధికారిక, అనధికారిక) ఉన్నాయి. మిగిలినవి ఇతర ఇంధనాలతో, ముఖ్యంగా డీజెల్‌తో నడుస్తున్నాయి. 1983-84వ సంవత్సరంలో 8.38 లక్షల హెక్టార్ల భూమి బావుల క్రింద సాగయింది. ఇది 1997-98 నాటికి 16.76 లక్షల హెక్టార్లకు చేరుకొంది. 2002-03 సంవత్సరానికి 18.43 లక్షల హెక్టార్లకు పెరిగింది. 1983-84 సంవత్సరంలో రాష్ట్రంలో నీటిపారుదల క్రింద వున్న భూమిలో 21.61 శాతం బావుల క్రింద సాగయింది. ఇది 1997-98 సంవత్సరంలో 42.5 శాతానికి చేరుకుంది. 2000-01 సంవత్సరంలో నీటిపారుదల క్రిందవున్న భూమి 45.39 లక్షల హెక్టార్లలకు చేరుకుంది. ఈ సంవత్సరంలో బావులక్రింద వ్యవసాయం 43.15 శాతం నీటిపారుదల గల భూమిలో చేపట్టబడింది. 2002-03 సంవత్సరంలో 51 శాతం నీటిపారుదల గల భూమి బావుల కిందనే సాగయింది. ఈ సంవత్సరంలో వర్షాభావం వలన మొత్తం నీటిపారుదల 36.14 లక్షల హెక్టార్లకు తగ్గింది. ఇటువంటి పరిస్థితిలో కూడ బావుల క్రింద వ్యవసాయం శాతం పెరిగింది. బావులతో పోల్చితే ఇతర నీటిపారుదల వ్యవస్థల కింద సాగయిన భూమి విస్తీర్ణం తగ్గుతూవుంది. 1983-84 సంవత్సరంలో చెరువుల క్రింద 10.87 లక్షల హెక్టార్లు సాగయింది. ఇది 2002-03 సంవత్సరానికి 4.25 లక్షల హెక్టార్లకు తగ్గింది. అదే విధంగా కాలువల క్రింద సాగయిన భూమి అదే కాలంలో 18.39 లక్షల హెక్టారుల నుండి 12.09 లక్షల హెక్టారులకు తగ్గింది.

బావుల క్రింద సాగవుతున్న భూమి విస్తీర్ణం పెరగడానికి ఒక ముఖ్యకారణం ఈ బావులకు కరెంటు కనెక్షన్లు అందచేయడం. 1983-84 సంవత్సరంలో 5.79 లక్షల కరెంటు పంపుసెట్లు వుండగా 1997-98 సంవత్సరం నాటికి 18.24 లక్షలకు పెరిగింది. రెగ్యులేటరీ కమీషన్ ఆదేశాలమేరకు జరిపిన కరెంటు మోటార్లు సెన్సస్ లెక్కల ప్రకారం 2003-04 సంవత్సరానికి ఈ పంపుసెట్ల సంఖ్య 20.51 లక్షలకు చేరుకుంది.

బావులక్రింద వ్యవసాయం ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలైన తెలంగాణా, రాయలసీమ మరియు ఉత్తర కోస్తా జిల్లాలలో ఎక్కువగా పెరిగింది. 1981-82 మరియు 1997-98 మధ్యకాలంలో తెలంగాణాలో బావుల క్రింద వ్యవసాయం 167 శాతం పెరిగింది. ఆదిలాబాద్‌లో 315 శాతం, నిజామాబాద్‌లో 248 శాతం, ఖమ్మంలో 189 శాతం పెరిగింది. ఇదే కాలంలో కోస్తా ప్రాంతంలో బావులక్రింద వ్యవసాయం 86 శాతం పెరిగింది. ఉత్తర కోస్తా జిల్లాలయిన శ్రీకాకుళం, విజయనగరం మరియు విశాఖపట్టణం జిల్లాలలో ఇది నాలుగు రెట్లు పెరిగింది. ఇదే కాలంలో రాయలసీమ ప్రాంతంలో బావులక్రింద వ్యవసాయం 75 శాతం పెరిగింది.

అయితే బావులక్రింద సాగవుతున్న మొత్తం భూమి పెరిగినా, ఒక్కో పంపు సెట్టు/బావిక్రింద సాగవుతున్న సగటు భూమి క్రమక్రమంగా తగ్గుతూ వచ్చింది. 1983-84వ సంవత్సరంలో సగటున ఒక బావిక్రింద 1.45 హెక్టార్ల భూమి సాగయింది. ఇది 1997-98 సంవత్సరానికి 0.92 హెక్టార్లకు, 2001-02 సంవత్సరానికి 0.90 హెక్టార్లకు తగ్గింది.

ఇది బావులక్రింద వ్యవసాయంలో చోటుచేసుకొంటున్న సంక్షోభాన్ని సూచిస్తుంది. క్షీణిస్తున్న భూగర్భజలాల వలన బావులలో ఊరుతున్న నీరు తగ్గుతూవున్నది. దీనితో పాటు రోజులో విద్యుత్‌ను సరఫరా చేసే సమయం కూడ తగ్గుతూంది. 20 సంవత్సరాల క్రితం వ్యవసాయానికి 13 గంటలపాటు విద్యుత్‌ను సరఫరా చేసేవారు. నేటికి ఇది 7 గంటలకు తగ్గింది. రైతులు వేసిన బోర్లు అన్నింటిలోనూ నీరు పడటం లేదు. విఫలమైన బోర్లను కూడ లెక్కలోనికి తీసుకుంటే సగటున ఒక బావికి అయ్యే ఖర్చు లక్షల రూపాయలలో వుంటుంది. ఈ డబ్బును కూడ రైతులు అధిక వడ్డీకి అప్పుగా తెచ్చుకున్నదే. వీటన్నిటితో పాటుగా విద్యుత్‌రంగ సంస్కరణలలో భాగంగా వ్యవసాయంపై కరెంటు ఛార్జీలను రెట్టింపు చేశారు. మూలిగే నక్కపై తాటికాయ పడ్డట్టు వ్యవసాయ ఉత్పత్తుల మార్కెట్‌లన్నీ దళారీల కంబంధ హస్తాలలో చిక్కుకున్నాయి. ఈ సంక్షోభంలో చిక్కుకున్న రైతులకు, ముఖ్యంగా బావుల క్రింద వ్యవసాయం చేసే రైతులకు "ఉచిత విద్యుత్" ఒక వరంగా కనిపించింది.

వ్యవసాయ రంగానికి ఉచిత విద్యుత్ అందించడం వలన ప్రభుత్వంపై అదనంగా రు.406 కోట్ల సబ్సిడీభారం పడుతుంది.

ప్రస్తుతం క్లిష్టమైన ఆర్థిక పరిస్థితిలో ఇది రాష్ట్ర ప్రభుత్వంపై మోయలేని భారమే. అయితే దీనిని భరించే మార్గాలు లేకపోలేదు. ప్రస్తుతం విద్యుత్ రంగంలోని పరిస్థితులలో, ముఖ్యంగా విద్యుత్ కొనుగోలు ఖర్చును తగ్గించుకుంటూ, ప్రభుత్వంపై ఎటువంటి భారం పడకుండానే వ్యవసాయరంగానికి విద్యుత్ ఉచితంగా అందించవచ్చు.

రాష్ట్రంలోని ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తి దారులకు అనవసరంగా చెల్లిస్తున్న అదనపు డబ్బును వ్యవసాయరంగానికి మళ్ళిస్తే అది తప్పకుండా సాధ్యమవుతుంది. విద్యుత్ ఉత్పత్తి రంగంలో ప్రైవేటు పెట్టుబడిదారులను ప్రోత్సహించాలన్న విధానంలో భాగంగా వారికి అత్యంత లాభకరంగా ఉండేటట్లు విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు (PPA) చేసుకున్నారు. ఇపుడు రాష్ట్రంలో నాలుగు ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు ఉన్నాయి. ఇవి జివికె, స్పెక్ట్రమ్, ల్యాంకో మరియు బిఎస్ఇఎస్. ఈ ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు రాష్ట్ర విద్యుత్ రంగానికి వరంగా ఉండటానికి బదులుగా ఒక శాపంగా పరిణమించాయి. పిపిఎలలో భాగంగా వారికిచ్చిన వాగ్దానం మేరకు పెట్టుబడిపై గ్యారంటీ లాభం వస్తుందన్న ఆశతో వారివారి పెట్టుబడులను ఉన్నదానికన్నా ఎక్కువగా చూపించారు. దీనితో పాటు వారికి కల్పించిన ప్రోత్సాహకాల వలన చేసే చెల్లింపులు భరించరానివిగా పెరిగాయి.

ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలను కేంద్ర ప్రభుత్వ సంస్థ ఎన్‌టిపిసి వారి విశాఖపట్టణం దగ్గర ఉన్న సింహాద్రి థర్మల్ విద్యుత్ కేంద్రంతో పోల్చి చూస్తే ప్రైవేటు కేంద్రాల వలన కలిగిన అదనపు భారం అర్థం అవుతుంది. నాలుగు ప్రైవేటు కేంద్రాలకన్న ఈ కేంద్రం తాజాగా నిర్మించబడింది. క్రింది పట్టికను చూస్తే ఈ విషయం తెలుస్తుంది.

## ప్రయివేట్ భారం

| వివరాలు | ప్రైవేటు కేంద్రాలు | ఎన్‌టిపిసి సింహాద్రి |
|---|---|---|
| ప్లాంటు సామర్థ్యం(మె.వా) | 999 | 1000 |
| ప్లాంటు నుండి కొనుగోలు చేస్తున్న విద్యుత్ (మి.యూ) | 6,149 | 6,170 |
| చెల్లిస్తున్న స్థిరఖర్చులు(రూ. కోట్లలో) | 821.1 | 485.4 |
| మొత్తం ఖర్చు (రూ.కోట్లలో) | 1,455.8 | 1,055.1 |

6,170 మిలియన్ యూనిట్లు ఉత్పత్తి చేసినందుకు ప్రభుత్వ రంగంలోని ఎన్‌టిపిసి కేంద్రానికి రు.1055.1 కోట్లు చెల్లిస్తుండగా, ప్రైవేటు ఉత్పత్తి దారులనుండి 6,149 మి.యూ. మాత్రమే కొని రు.1,455.8 కోట్లు చెల్లిస్తున్నారు. అనగా రు. 400 కోట్లు ప్రతిసంవత్సరం అదనంగా ప్రైవేటు పెట్టుబడిదారులను అప్పనంగా అందిస్తున్నారు. ఈ అదనపు చెల్లింపులను వ్యవసాయరంగానికి మళ్ళించి ఉచిత విద్యుత్ అందించడం ద్వారా లక్షలాది రైతు కుటుంబాలకు స్వాంతన కలిగించవచ్చు.

దీనికై ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తి దారులతో కుదుర్చుకున్న పిపిఎలను తిరగదోడవలసిన అవసరం వుంది. ఇలా పిపిఎలను తిరగదోడటం క్రొత్తేమీ గాదు. కొద్దికాలం క్రితం గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వం అక్కడి పిపిఎలను తిరిగి వ్రాసి ఏటా రు. 495 కోట్లను ఆదా చేసుకుంది. ఇందుకు APERC కూడ సుముఖంగానే వుంది. ఇది మన రాష్ట్రంలో కూడ చేయవచ్చు. ఈ పని చేస్తామని అధికారంలోకి వచ్చిన తరువాత కాంగ్రెస్ ప్రభుత్వం కూడ ప్రకటించింది. రోశయ్య గారి అధ్యక్షతన దీనికోసమై ఒక కమిటీని నియమించారు. దాని తరువాత ఎటువంటి కదలిక లేదు.

## వ్యవసాయరంగానికి విద్యుత్ సబ్సిడి

| వివరములు | 2001-02 | 2002-03 | 2003-04 | 2004-05 |
|---|---|---|---|---|
| వ్యవసాయరంగంలో విద్యుత్ వినియోగం (మి.యూ) | 9815 | 9936 | 11350 | 11450 |
| వ్యవసాయరంగానికి కాస్ట్ టు సర్వే(రు/యూ) | 2.57 | 2.38 | 1.81 | 1.61 |
| వ్యవసాయ కరెంటు ఛార్జీ సగటున (రు/యూ) | 0.31 | 0.31 | 0.32 | 0.36 |
| వ్యవసాయరంగం నుంచి వచ్చిన ఆదాయం (రు.కోట్లు) | 302.00 | 305.00 | 362.98 | 409.17 |
| క్రాస్ సబ్సిడీ (రు.కోట్లు) | 1370.62 | 1222.38 | 926.61 | 821.15 |
| ప్రభుత్వ సబ్సిడీ (రు. కోట్లు) | 849.83 | 837.39 | 664.70 | 609.97 |
| మొత్తం సబ్సిడీ (రు.కోట్లు) | 2220.45 | 2059.77 | 1591.31 | 1431.12 |

మూలం: APERC Tariff Orders.

ఎపి ఎలక్ట్రిసిటి రెగ్యులేషన్(APERC) టారిఫ్ ఆర్డర్ ప్రకారం ప్రస్తుత సంవత్సరంలో విద్యుత్ సరఫరా కంపెనీలకు వ్యవసాయరంగం నుండి రు. 409.17 కోట్లు ఆదాయం రాగా ప్రభుత్వ సబ్సిడీ రూపంలో రు.609.97 కోట్లు అందుతాయి. అయితే APERC ఈ సంఖ్యలను ఎలా తేల్చింది అన్నదానిపై సరియైన వివరణ లేదు. ఈ ఆదాయం మరియు సబ్సిడీ లెక్కలు వ్యవసాయరంగంలో విద్యుత్ వినియోగం మీద, మరియు వ్యవసాయరంగానికి విద్యుత్‌ను సరఫరా చేయడానికి అయ్యే ఖర్చు (కాస్ట్ టు సర్వే) మీద ఆధారపడి వుంటాయి. అయితే APERC గాని, ప్రభుత్వం గాని ఉటకించే ఈ లెక్కలు నమ్మదగ్గవి కాదు. 2001-02వ సంవత్సరంలో వ్యవసాయానికి కాస్ట్ టు సర్వే ఒక యూనిట్‌కు రు. 2.57 వుండగా 2004-05వ సంవత్సరానికి రు. 1.61కి తగ్గింది. తగ్గడం మంచిదే అయితే ఇది ఎలా తగ్గింది అనడానికి సరియైన వివరణ ఎక్కడా లేదు. అలాగే 2004-05 సంవత్సరంలో వ్యవసాయరంగంలో విద్యుత్ వినియోగం 11450 మిలియన్ యూనిట్లు వుంటుందని పేర్కొన్నారు. ఇది కూడ నమ్మశక్యం కాని సంఖ్య. 1983వ సంవత్సరంలో 5.36 లక్షల వ్యవసాయ పంపుసెట్లు ఉన్నపుడు వాటి విద్యుత్ వినియోగం 1,540 మిలియన్ యూనిట్లు. 2004-05 సంవత్సరముకు సుమారు నాలుగురెట్లు పెరిగి ఈ పంపుసెట్లు సంఖ్య 20.51 లక్షలు చేరుకోగా

విద్యుత్ వినియోగం అనూహ్యంగా దాదాపు ఎనిమిదిరెట్లు పెరిగి 11,450 మిలియన్ యూనిట్లకు చేరుకోనుంది. 1983లో పంపుసెట్లకు మీటర్లు వుండి వాటి వినియోగం సరిగా తెలిసే ఇపుడు పంపుసెట్లకు మీటర్లు లేకపోవడం వలన వాటి వినియోగాన్ని ఉజ్జాయింపుగా చెపుతారు. అయితే APERC/APTRANSCO ఉజ్జాయింపు లెక్కలకు ఎటువంటి ఆధారం లేదు. మునుపు వ్యవసాయ రంగానికి విద్యుత్ 13 గంటల సరఫరా అయ్యేది. అది ఇపుడు 7 గంటలకు తగ్గింది. భూగర్భజలాల లభ్యత కూడ అప్పటికీ ఇప్పటికీ బాగా తగ్గింది. దీనిని బట్టి చూస్తే విద్యుత్ వినియోగం ఒక్కో మోటర్‌కు సగటున తక్కువ వుండాలి. విద్యుత్ వినియోగం నేటికి నాలుగు రెట్లు పెరిగితే 6500 మిలియన్ యూనిట్ల వరకు ఉంటుంది. అంటే వ్యవసాయరంగం మీద అదనంగా 5000 మిలియన్ యూనిట్లను చూపుతున్నారు. దీనిని ఇతర రంగాలలోనైనా వినియోగించి వుండాలి. లేక దొంగలించబడి వుండాలి. ఈ 5000 మిలియన్ యూనిట్లను యూనిట్ రెండు రూపాయల చొప్పున వెయ్యికోట్ల ఆదాయం వుంటుంది. దీనికి తగ్గట్టుగా రాయితీల భారాన్ని తగ్గించుకోవచ్చు.

వ్యవసాయరంగానికి ఇతర రంగాల వినియోగదారుల మాదిరి 24 గంటల విద్యుత్ సరఫరా వుండదు. అది 7 గంటలు మాత్రమే. ఈ 7 గంటల సరఫరా కూడ విద్యుత్ వినియోగం ఎక్కువలేని సమయంలో ఉంటుంది. వ్యవసాయ రంగానికి విద్యుత్ సరఫరా దాని అవసరాలకు అనుగుణంగా కాక, ట్రాన్స్‌కో, డిస్కమ్‌లు తమ వెసులుబాటును బట్టి సరఫరా చేస్తున్నాయి. నాన్ పీక్ అవర్స్‌లో విద్యుత్ వినియోగించడం ద్వారా వ్యవసాయరంగం విద్యుత్ రంగానికి సేవ చేస్తున్నది. ఇదే లేకపోతే కొన్ని విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలలో విద్యుత్ ఉత్పత్తిని నిలిపి వేయవలసి వస్తుంది. ఈ కేంద్రాలను నిలిపివేసి తిరిగి ప్రారంభించడం ఖర్చుతో కూడిన పని. వ్యవసాయరంగం ఈ ఖర్చును తగ్గిస్తుంది.

ఉచిత విద్యుత్ ఇవ్వడం సాధ్యమే. కాని ఇది విజయవంతం కావాలంటే కొన్ని విషయాలను గుర్తుంచుకోవాలి. రైతులకు సక్రమమైన, నాణ్యమైన విద్యుత్‌ను అందించాలి. వారికి అవసరమైన విద్యుత్ అందించనపుడు "ఉచిత విద్యుత్" ప్రకటించి ప్రయోజనం వుండదు. అప్పుడు చంద్రబాబునాయుడు భయపెట్టినట్టు కరెంటు తీగలు బట్టలు అరబెట్టుకోవడానికి పనికి వస్తాయి. దీనిపై విద్యుత్‌ను తక్కువ ధరకు కొనేటట్లు అన్ని పిపిఎలను సవరించాలి. దీనితోపాటు విద్యుత్ సరఫరా-పంపిణీలోని నష్టాలను, విద్యుత్ చౌర్యాన్ని అరికట్టాలి. అపుడే 'ఉచిత విద్యుత్' కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి అవకాశముంటుంది.

ఉచిత విద్యుత్ సాధ్యమే అయినా ఇది అందరికీ ఇవ్వవలసిన అవసరం వుందా? అన్న ప్రశ్న కూడ ఉత్పన్నమవుతున్నది. ఈ కార్యక్రమం వలన భూమిలేని నిరుపేదలకు ఎటువంటి లాభం వుండదు. దీని వలన లాభపడేది భూములున్న వారు, అదీ కూడ వారి వారి భూముల్లో బావులు వున్న వారు మాత్రమే. బావులున్న వారందరికీ కూడ ఈ కార్యక్రమం వర్తింప చేయాలా అన్న ప్రశ్న కూడ వస్తుంది. రైతులలోను కరెంటు ఛార్జీలు చెల్లించగల స్తోమత వున్న వారు వున్నారు. ఇది ముఖ్యంగా పెద్ద/ధనిక రైతులకు వర్తిస్తుంది. స్తోమత వున్నవారికి కూడా, ఉచిత విద్యుత్‌ను అందించడంలో అర్థం లేదు. అలాగే ఫార్మ్‌హౌసెస్ కట్టుకున్న వారికి, కాంట్రాక్ట్ ఫార్మింగ్ చేస్తున్న కంపెనీలకు ఈ కార్యక్రమాన్ని వర్తింపచేయడం సరి అయినది కాదు. లక్షలాది రూపాయల ఆదాయం కలవారు కూడ ఆదాయం పన్ను ఎగవేయడంలో, నల్లడబ్బును తెల్లడబ్బుగా మార్చుకొనడానికి వ్యవసాయంలో వున్నారు. అటువంటి వారిని ఈ కార్యక్రమం క్రింద తీసుకోకూడదు. బావుల క్రింద సాగవుతున్న భూమిలో దాదాపు 25 శాతం పెద్ద రైతుల ఆధీనంలో వుంది. వీరి నుండి కరెంటు ఛార్జీలు రాబట్ట వలసిన అవసరం వుంది. వీరికి 'ఉచిత విద్యుత్' వర్తింపచేయరాదు.

ఈ ఉచిత విద్యుత్‌ను హైటెన్షన్(HT) సిస్టమ్ క్రిందవున్న ఎత్తిపోతల పథకాలకు కూడ అన్వయింపచేశారు. దీని వలన ప్రభుత్వంపై రు.60కోట్ల భారం పడుతుంది. ఈ ఎత్తిపోతల పథకాలకు ప్రభుత్వమే పెట్టుబడి పెట్టి చాలాకాలం వరకూ, చంద్రబాబు నాయుడు పాలనవరకూ, తానే నడిపింది. ఇందులో బావుల క్రింది రైతుల మాదిరి రైతులు పెట్టుబడిని అందించలేరు. ఎత్తిపోతల పథకాల క్రింది రైతులు బావుల క్రింద రైతులు ఎదుర్కొన్న కష్టాలను, సంక్షోభాన్ని ఎదుర్కొనలేరు. కాబట్టి వారికి కూడ 'ఉచిత విద్యుత్'ను వర్తింపచేయడం సమంజసం కాదు. ఎత్తిపోతల రైతులు కూడ కొన్ని సమస్యలు ఎదుర్కొంటున్నారు. కాని వాటికి "ఉచిత విద్యుత్" పరిష్కారం కాదు.

'ఉచిత విద్యుత్' కార్యక్రమం వలన ఎటువంటి అవాంఛనీయ పరిణామాలు లేకుండా ఉండేటట్లు జాగ్రత్త వహించాలి. ఇది ముఖ్యంగా పర్యావరణ సమస్యలకు వర్తిస్తుంది. విచక్షణారహితంగా బోరు బావులు త్రవ్వడం వలన భూగర్భ జలాలు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో అడుగంటి పోయాయి. దీనివలన ఒకవైపున బావులపై పెట్టుబడి ఖర్చు పెరుగుతుంది. మరొకవైపు ఆరోగ్య సమస్యలకు దారితీస్తున్నది. రాను రాను బోరుబావుల లోతు పెరుగుతూ వుండటంతో భూగర్భ జలాలు ఫ్లోరైడ్‌తో కలుషితమవుతున్నాయి. ఇంతకుమునుపు ఫ్లోరైడ్ సమస్య నల్గొండ జిల్లాకు పరిమితమై వుండేది. బోరు బావులు విస్తరించిన తరువాత ఫ్లోరైడ్ సమస్య బావులు ఎక్కువగా ఉన్న అన్ని జిల్లాలకు ప్రాకింది. దీని నుంచి ప్రజలను కాపాడడానికి భూగర్భజలాల వినియోగాన్ని నియంత్రించవలసిన అవసరం వుంది. లేకపోయినట్లయితే "ఉచిత విద్యుత్" వలన ఈ సమస్య మరింత జటిలమయ్యే అవకాశం వుంది. కాబట్టి ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవాలి.



# విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు

- యం. వేణుగోపాలరావు

వి నియోగదారులకు విద్యుత్ సరఫరాకు అవుతున్న వ్యయంలో అత్యధిక భాగం విద్యుత్ కొనుగోలుకు సంబంధించినదే. 1990 దశకం ప్రారంభంలో మొదలు పెట్టిన విద్యుత్ సంస్కరణలలో భాగంగా ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులకు అనుమతులనిచ్చేందుకు అనుసరించిన విధానంలో భాగంగా విద్యున్మండళ్ళు వాటితో విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు చేసుకున్నాయి. రాష్ట్రంలో ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులకు అనుమతులనిచ్చిన తీరు వాటితో విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు (పిపిఎ) చేయించిన తీరు వివాదస్పదంగా మారాయి. అవసరమైన దానికన్నా చాలా అధిక పెట్టుబడులను అనుమతించటం, చాలా అధిక లాభాలను గ్యారంటీ చేసే రీతిలో పిపిఎలను చేసుకొనటం ఈ వివాదాలకు కారణం. ఇవి చివరకు రాష్ట్ర ప్రభుత్వానికి, వినియోగదారులకు చాలా భారంగా పరిణమించాయి. విద్యుత్‌రంగంలో ప్రైవేటు పెట్టుబడులను ప్రోత్సహించే పేరుతో కేంద్ర ప్రభుత్వం 1992 నుండి మార్గదర్శక సూత్రాలను, నిబంధనలను జారీ చేస్తూ, మార్పు చేస్తూ వచ్చింది. ఆ నష్టదాయక, లోపభూయిష్ట మార్గదర్శక సూత్రాలను, నిబంధనలను పాటించి, కొన్నిటిని వక్రీకరించి కూడా రాష్ట్ర ప్రభుత్వం అనుసరించింది.

ఒక విద్యుత్ ప్రాజెక్టునుండి కొనుగోలు చేసే విద్యుచ్ఛక్తి వ్యయాన్ని స్థిర ఛార్జీలను, అస్థిర ఛార్జీలను, ప్రోత్సాహకం వుంటే దానిని పరిగణలలోకి తీసుకొని లెక్కగడతారు. విద్యుత్‌ను ఉత్పత్తి చేయడానికి వినియోగించే ఇంధనానికి రవాణాతోసహా అయ్యే ఖర్చునంతటిని అస్థిర ఛార్జీలుగా పరిగణిస్తారు. ప్రాజెక్టు పెట్టుబడిలో రుణంపై వడ్డీ, అరుగుదల ఛార్జీలు, పనిచేయించి, నిర్వహించే (ఒ అండ్ ఎం) వ్యయం, బీమా ఖర్చులు, నిర్వహణ పెట్టుబడిపై వడ్డీ, ఈక్విటీపై లాభం, పెట్టుబడిలో విదేశీ మారక ద్రవ్యం మార్పిడి రేటులో వచ్చే తేడాల సర్దుబాటు, ఆదాయపు పన్ను, ప్రోత్సాహకం స్థిర ఛార్జీలు వుంటాయి. రాష్ట్రంలో విద్యుత్ సరఫరా చేసే ప్రాజెక్టుల పిపిఎలకు ఆంధ్రప్రదేశ్ విద్యుత్ నియంత్రణా కమీషన్ ఆమోదాన్ని పొందాలి. ఒకటికన్నా ఎక్కువ రాష్ట్రాలకు సరఫరా చేసే ప్రాజెక్టుల పిపిఎలకు కేంద్ర విద్యుత్ నియంత్రణ కమీషన్ ఆమోదాన్ని పొందాలి. 1998 ఆంధ్రప్రదేశ్ విద్యుత్ సంస్కరణచట్టం ప్రకారం రాష్ట్ర విద్యుత్ నియంత్రణ కమీషన్ రాష్ట్రంలో ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టుల పిపిఎలకు ఆమోదం తెలుపుతూ వస్తున్నది. విద్యుత్ ప్రాజెక్టులకు కేంద్ర విద్యుత్ అథారిటీ (సిఇఎ) సాంకేతిక, ఆర్థిక అనుమతి అవసరం. పార్లమెంటు చేసిన విద్యుత్ చట్టం 2003లో అనేక మార్పులను చేశారు. అయినప్పటికీ అప్పటికే చేసుకున్న పిపిఎలు కొనసాగుతున్నాయి.

పిపిఎలకు నియంత్రణా కమీషన్ ఆమోదం తెలిపే ముందు వాటిని అనేక కోణాలనుండి పరిశీలించాలి. మొదటిది, రాష్ట్రంలో పెరుగుతున్న విద్యుత్ డిమాండును తీర్చడానికి ప్రతిపాదిత ప్రాజెక్టు అవసరమా అనేది. రెండవది, ప్రాజెక్టు పెట్టుబడి వ్యయం సమర్థనీయమా లేక ఇంకా చాలా తక్కువ వ్యయానికి అలాంటి ప్రాజెక్టును నెలకొల్పడానికి అవకాశాలున్నాయా అనేది. మూడవది, విద్యుత్ ఉత్పత్తికి వాడే ఇంధనం ప్రాజెక్టు పనిచేసే జీవిత కాలం లేదా పిపిఎ కాలం అంతా లభ్యమవుతుందా, దాని ధరలలో దశల మార్పు లేమిటనేది. నాల్గవది, ప్రత్యామ్నాయ ఇంధనాల లభ్యత, వాటి వినియోగానికి అవకాశం, వాటి ధరలు. అయిదవది, ప్రాజెక్టు మొదటి ఆర్డర్ డిస్పాచ్‌కు లోబడి వుంటుందా అనేది. ఆరవది, పిపిఎలోని నిబంధనలు సముచితంగా వున్నాయా, వినియోగదారులు చెల్లించాల్సిన ఛార్జీలపై వాటి ప్రభావం ఎలా వుంటుందనేది.

ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులకు సంబంధించి విద్యుత్ నియంత్రణా కమీషన్ ఇంతవరకు బిపిఎల్ (2×260 మె.వా), బిఎస్ఇఎస్ (220 మె.వా) వేమగిరి (370 మె.వా), గౌతమి (464 మె.వా), కోనసీమ (445 మె.వా), జివికె విస్తరణ (220 మె.వా) ప్రాజెక్టుల పిపిఎలను ఆమోదించింది. ఇవిగాక, పలు మినీ విద్యుత్ ప్రాజెక్టులు, సంప్రదాయేతర ఇంధన వనరుల ప్రాజెక్టుల పిపిఎలను ఆమోదించింది. నియంత్రణ కమీషన్ ఏర్పడక పూర్వం, రాష్ట్ర విద్యుత్ సంస్కరణచట్టం అమలులోకి రాకపూర్వం జివికె (216 మె.వా), స్పెక్ట్రం (208 మె.వా), లాంకో కొండపల్లి (350 మె.వా) ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టుల పిపిఎలు పూర్తయినాయి. ఆ విధంగా చట్టం అమలులోకి రాక పూర్వం అన్ని విధాలుగా పూర్తయిన పిపిఎలను తాను సమీక్షించలేనన్న వైఖరిని నియంత్రణ కమీషన్ తీసుకొంది. ఒకేరకమైన ప్రాజెక్టులకు మె.వా.కు సగటు పెట్టుబడి, పిపిఎలలోని నిబంధనలు ఒకే విధంగా లేవు. ఒకే కాలంలో అమలు జరిగిన ఒకే రకమైన ప్రాజెక్టుల మధ్య వీటికి సంబంధించి తీవ్ర వ్యత్యాసాలున్నాయి. ప్రైవేటు, ప్రభుత్వ ప్రాజెక్టుల మధ్య, ప్రైవేటు ప్రాజెక్టుల మధ్య కూడా ఇలాంటి తీవ్ర వ్యత్యాసాలున్నాయి. అధిక పెట్టుబడి వ్యయాన్ని చూపటంలో ప్రాజెక్టుల యాజమాన్యాలు అక్రమాలకు పాల్పడి స్వంత పెట్టుబడి (ఈక్విటీ) మొత్తాన్ని కూడా రుణం నుండే సర్దుబాటు చేసిన ఉదంతాలున్నాయి. ఉదాహరణకు, కేంద్ర ప్రభుత్వం ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులను ప్రోత్సహించే విధానం వక్రీకరణలో భాగంగా కాకినాడలో ఎన్‌టిపిసి నెలకొల్ప తలపెట్టిన 200 మె.వా. ల గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్రాజెక్టును ఒక ప్రైవేటు

సంస్థ స్పెక్ట్రం టెక్నాలజీ లిమిటెడ్‌కు అప్పగించాలని ఆదేశించారు. ఈ సంస్థలో ఎం.కిషన్‌రావు, ఎ.వి. మోహన్‌రావులు ప్రధాన భాగస్వాములుగా వున్నారు. వీరి మధ్య వివాదాలతో న్యాయస్థానాలకు వెళ్ళటంతో ఈ ప్రాజెక్టును నెలకొల్పడంలో జరిగిన మోసాలు వెలుగులోకి వచ్చాయి.

స్పెక్ట్రం ప్రాజెక్టును నెలకొల్పేందుకు ఇంజనీరింగ్, సేకరణ, నిర్మాణం (ఇపిసి) కాంట్రాక్టును బ్రిటన్‌కు చెందిన రోల్స్‌రాయిస్ సంస్థకు ఇప్పించినందుకు కిషన్‌రావుకు చెందిన బోగస్ కంపెనీ టొవాండో సర్వీసెస్‌కు రోల్స్‌రాయిస్ 19.3 మిలియన్ డాలర్లను, 1.3 మిలియన్ పౌండ్లను "కమీషన్" గా ఇచ్చింది. ఇపిసి కాంట్రాక్టులో భాగంగా కిషన్‌రావు కుమారులు, బంధువులు పేరున వున్న బోగస్ కంపెనీలకు రు. 30 కోట్ల కాంట్రాక్టు ఇచ్చినట్లు చూపారు. ఇదే కాలంలో స్వచ్ఛంద ఆదాయ పథకం కింద కిషన్‌రావు రూ. 35 కోట్ల ఆదాయాన్ని వెల్లడించారు. ఎన్‌టిపిసి రూ. 400 కోట్ల వ్యయంతో నెలకొల్పాలని ప్రతిపాదించిన ప్రాజెక్టు వ్యయాన్ని రూ. 1100 కోట్లదాకా పెంచి చూపింది. ఈ ప్రాజెక్టుకు సిఇఎ రూ. 748 కోట్ల మేరకే సాంకేతిక, ఆర్థిక అనుమతి నిచ్చింది రూ. 180 కోట్ల మేరకు ఇలా మోసపూరితంగా అధిక వ్యయాన్ని చూపినట్లు అంచనా. దీనిపై ఎపిట్రాన్స్‌కో సిబిఐకి చేసిన ఫిర్యాదుపై దర్యాప్తు జరుగుతున్నది. జివికె ప్రాజెక్టు కూడా వ్యయాన్ని రూ. 816 కోట్ల నుండి రూ. 1023 కోట్లకు పెంచినట్లు చూపింది. మెగావాట్‌కు పెట్టుబడి వ్యయాన్ని జివికె రూ. 4.75 కోట్లుగా, స్పెక్ట్రం రూ. 4.68 కోట్లుగా చూపుతుండగా, ఇదే కాలంలో అమలు జరిగిన సంయుక్తరంగ ప్రాజెక్టు ఎపిజిపిసిఎల్ రెండవదశ రూ. 2.73 కోట్ల వ్యయాన్ని చూపింది. అధిక పెట్టుబడి వ్యయాన్ని చూపితే అధికస్థిర ఛార్జీలను రాబట్టడానికి దారి తీస్తుంది.

మె.వా. కు బిపిఎల్ ప్రాజెక్టు రూ. 5.25 కోట్ల పెట్టుబడి వ్యయాన్ని చూపగా, ఎన్‌టిపిసికి చెందిన సింహాద్రి ప్రాజెక్టు (1000 మె.వా.) రూ. 3.59 కోట్ల వ్యయాన్ని, ఎపిజెన్‌కోకు చెందిన రాయలసీమ థర్మల్ ప్రాజెక్టు రెండవదశ (420 మె.వా) రూ. 3.74 కోట్ల చొప్పున వ్యయాన్ని చూపాయి. ప్రాజెక్టుల వ్యయాన్ని వాస్తవంగా జరిగిన దానికన్నా అధికంగా చూపి అక్రమంగా నిధులను పొందటంతో పాటు, అధిక పెట్టుబడి వ్యయాన్ని చూపటం ద్వారా అధిక ఛార్జీల రూపంలో కూడా పిపిఎ అమలులో వున్న కాలంలో అక్రమ లాభార్జన చేస్తున్నారు.న లా భావం రీత్యా ఈ వ్యాసంలో ప్రతి ప్రాజెక్టు పిపిఎకి సంబంధించిన విశ్లేషణ చేయటం సాధ్యంకాదు. అందువల్ల, పిపిఎలలో సాధారణంగా లోపభూయిష్టంగా, వినియోగదారులకు నష్టదాయకంగా వున్న ముఖ్యాంశాల వివరణకే పరిమితమవుతున్నాము.

**కృత్రిమంగా తక్కువ స్థాయిలో పిఎల్ఎఫ్**

విద్యుత్ ఉత్పత్తికి పూర్తి స్థిర ఛార్జీలను చెల్లించేందుకు ప్లాంట్‌లోడ్ ఫాక్టర్‌ను (పిఎల్ఎఫ్-ప్లాంటు ఉత్పత్తి సామర్థ్యం వినియోగం) జివికె, స్పెక్ట్రం కేసులలో 68.5 శాతంగా నిర్ణయించారు. మెగావాట్‌కు 100 శాతం పిఎల్ఎఫ్‌తో ఉత్పత్తి చేస్తే ఏడాదికి 8.76 మిలియన్ యూనిట్లు ఉత్పత్తి అవుతాయి. 68.5 శాతం పిఎల్ఎఫ్‌తో అయితే 6.0006 మి.యూ. ఉత్పత్తి అవుతాయి. అనగా, 8.76 మి.యూ.ల ఉత్పత్తికి చెల్లించాల్సిన పూర్తి స్థిర ఛార్జీలను 6.0006 మి.యూ.లకే చెల్లించాలి. కాగా 68.5 శాతం పిఎల్ఎఫ్ ను నిర్ణయించటం పూర్తిగా అసంబద్ధమైనది. వాస్తవానికి, జివికె, స్పెక్ట్రంతో సహా అనేక విద్యుత్ ప్రాజెక్టులు 90 శాతం, అంతకు మించిన పిఎల్ఎఫ్‌ను సాధిస్తున్నాయి.

68.5 శాతం పిఎల్ఎఫ్ ఉత్పత్తికే పూర్తి స్థిర ఛార్జీలను చెల్లిస్తే, విద్యుత్ కొనుగోలు వ్యయం ఎంత అధికంగా వుంటుందో ఈ ఉదాహరణను బట్టి అర్థం చేసుకోవచ్చు. సిఇఎ లెక్క ప్రకారం, 520 మె.వా. బిపిఎల్ ప్రాజెక్టు 68.5 శాతం పిఎల్ఎఫ్‌తో ఉత్పత్తి చేస్తే 30 ఏళ్ళ పిపిఎ కాలంలో సగటు ఛార్జీ యూనిట్‌కు రూ. 3.79 అవుతుంది. ఇదే 85 శాతం పిఎల్ఎతో ఉత్పత్తి చేస్తే సగటు యూనిట్ ఛార్జీ రూ. 3.53 అవుతుంది. అనగా, యూనిట్‌కు 26 పైసల చొప్పున ఏడాదికి 68.5 శాతం పిఎల్ఎఫ్‌తో చేసే ఉత్పత్తికి రూ. 81.13 కోట్ల మొత్తాన్ని అధికంగా చెల్లించాలి. ఆ విధంగా, 30 ఏళ్ళకాలంలో రూ. 2433.9 కోట్ల మొత్తాన్ని అధికంగా చెల్లించాల్సి వస్తుంది!

**డీమ్డ్ జనరేషన్**

పిపిఎలలో వినియోగదారుల ప్రయోజనాలను దెబ్బతీసే అతి ప్రమాదకర షరతులలో డీమ్డ్ జనరేషన్ ఒకటి. ఒక ప్రాజెక్టు విద్యుత్ ఉత్పత్తి చేయడానికి సిద్ధంగా వున్నట్లు తెలిపితే, ఏ కారణం వల్లనైనా ఎపిట్రాన్స్‌కో ఆ ప్రాజెక్టును ఉత్పత్తి చేయవద్దని ఆదేశిస్తే ఆ ప్రాజెక్టు విద్యుత్‌ను ఉత్పత్తి చేసినట్లుగా భావించి (డీమ్డ్ జనరేషన్) ట్రాన్స్‌కో ఆ ప్రాజెక్టుకు పూర్తి స్థిర ఛార్జీలను చెల్లించాలి. అనగా, విద్యుత్‌ను ఉత్పత్తి చేయకుండా, కొనుగోలు చేయకుండా, వినియోగించకుండానే ఈ స్థిర ఛార్జీలను ప్రాజెక్టుకు చెల్లించాలి. అలా చెల్లించకపోతే, తాము చేసిన అప్పుల వాయిదాలను వడ్డీతో సహా తిరిగి చెల్లించలేమని, ఇతర ఖర్చులను భరించాలన్నది ఈ విధంగా డీమ్డ్ జనరేషన్‌పై స్థిర ఛార్జీల చెల్లింపుకు సమర్థనగా చేస్తున్న వాదన. అయితే, మార్కెట్లో డిమాండు పడిపోయి, ఒక పరిశ్రమ తన ఉత్పత్తిని తగ్గించు వేసుకోవాల్సి వస్తే, చేసిన ఉత్పత్తికే పూర్తి స్థిర ఛార్జీలను కలిపి ఆ పరిశ్రమ తన ఉత్పత్తిని మార్కెట్లో పోటీపడి అమ్ముకోలేదు. పూర్తిగా ఉత్పత్తిని నిలిపి వేయాల్సివస్తే, ఆ పరిశ్రమ ఎవరినుండి స్థిర ఛార్జీలను

వసూలు చేసుకోజాలదు. అయితే, పోటీని ఎదుర్కొనకుండానే ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులు డీమ్డ్ జనరేషన్ నిబంధన కింద అనుచితంగా స్థిర ఛార్జీల ప్రయోజనాన్ని పొందుతున్నాయి.

**మితి మీరిన అరుగుదల ఛార్జీలు**

ఒక ప్రాజెక్టును పని చేయించినపుడు దాని యంత్రాలు, తదితరాలు అరుగుదలకు గురై కొంత విలువను కోల్పోతాయి. ఏడాదికి ప్రాజెక్టు పని చేసే కాలాన్ని బట్టి ప్రాజెక్టు ఉపయోగపడే జీవిత కాలంలో 90 శాతం దాకా అరుగుదల ఛార్జీలను వసూలు చేసే విధానాన్ని అనుసరిస్తున్నారు. విద్యుత్ ప్రాజెక్టులు 25 నుండి 30 సంవత్సరాల దాకా పనిచేస్తున్నాయి. కాబట్టి 90 శాతం అరుగుదల విలువను రాబట్టేందుకు ఏడాదికి 3 లేదా 4 శాతం అరుగుదల ఛార్జీలను వసూలు చేస్తే సరిపోతుంది. అయితే, కేంద్ర ప్రభుత్వ మార్గదర్శక సూత్రాలననుసరించి ఏడాదికి 7.84 శాతం అరుగుదల ఛార్జీలను చెల్లించాలని పిపిఎలలో నిబంధనను పొందు పరచి, అమలు చేస్తున్నారు. అనగా, 90 శాతం అరుగుదల ఛార్జీలను దాదాపు 11 సంవత్సరాలలోనే వసూలు చేస్తున్నారు. 25-30 సంవత్సరాల కాలంలో చెల్లించాల్సిన అరుగుదల ఛార్జీలను 11 సంవత్సరాలలోనే వసూలు చేయటంవల్ల అధిక ఛార్జీల రూపంలో వినియోగదారులు ముందుగానే చెల్లింపుచేసినట్లవుతుంది. ఉదాహరణకు, బిపిఎల్ ప్రాజెక్టు మొత్తం పెట్టుబడి వ్యయం రూ. 2786.44 కోట్లలో ఏటా 7.84 శాతం అరుగుదల ఛార్జీల కింద రూ. 225.51 కోట్ల మొత్తాన్ని చెల్లించాలి. 30 ఏళ్ళు పనిచేసే ప్రాజెక్టుగా ఏడాదికి మూడు శాతం అరుగుదల ఛార్జీలను నిర్ణయిస్తే రు. 86.29 కోట్ల చొప్పున మాత్రమే చెల్లించాలి. అనగా, ఏడాదికి రూ. 139.22 కోట్ల మేరకు అరుగుదల ఛార్జీల చెల్లింపు తగ్గుతుంది. 80 శాతం పిఎల్ఎఫ్‌తో చేసే ఉత్పత్తి 3644.16 మిలియన్ యూనిట్ల కొనుగోలుకు యూనిట్‌కు 38 పైసల చొప్పున ఛార్జీలు తగ్గుతాయి. అరుగుదల ఛార్జీలనుండి ప్రాజెక్టు వ్యయంలో 70 శాతంగా వున్న అప్పును పదేళ్ళలో తీర్చాలి గనుక అరుగుదల ఛార్జీలను 7.84 శాతంగా వసూలు చేయాలన్నది వాదన. చేసిన అప్పును తిరిగి చెల్లించాల్సిన కాలాన్ని బట్టి ఏ పరిశ్రమ తన ఉత్పత్తుల విలువను అధికంగా నిర్ణయించి, ముందుగానే రాబట్టుకొనే పద్ధతిలో మార్కెట్లో పోటీకి తట్టుకోజాలదు. పరిశ్రమ పనిచేసే జీవితకాలంలో అరుగుదల ఛార్జీలను రాబట్టుకొనే రీతిలోనే రుణాలను తిరిగి చెల్లించాల్సిన కాలాన్ని నిర్ణయించుకొనే రీతిలో దీర్ఘకాలిక రుణాలను పొందాలి.

**హేతు విరుద్ధ ప్రోత్సాహకాలు**

నిర్ణీత స్థాయీ పిఎల్ఎఫ్ శాతానికి మించి చేసే ఉత్పత్తికి ప్రోత్సాహకాలను నిర్ణయించటం కూడా ఒక పద్ధతి ప్రకారం జరగలేదు. జివికె, స్పెక్ట్రం ప్రాజెక్టులకు 68.5 శాతం పిఎల్ఎఫ్ కు మించి చేసిన ఉత్పత్తికి 85 శాతం పిఎల్ఎఫ్ వరకు 1 శాతం పిఎల్ఎఫ్‌కు ఈక్విటీలో 0.525 శాతం ప్రోత్సాహకాన్ని ఇవ్వాలని పిపిఎలలో పొందుపరిచారు. అనగా, ఈక్విటీలో 8.66 శాతం మొత్తాన్ని ప్రోత్సాహకంగా పొందడానికి వీలుకల్పించారు. విద్యుత్ ప్రాజెక్టులు సాధారణంగా 80 శాతం నుండి 90 శాతం పిఎల్ఎఫ్‌తో పని చేస్తుండగా, ఈ విధంగా ప్రోత్సాహకాన్ని నిర్ణయించటం అనుచితం. ఇతర గ్యాస్ ఆధారిత ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులకు 80 శాతం, బిఎస్ఇఎస్ ప్రాజెక్టుకు 85 శాతం పిఎల్ఎఫ్‌కు మించిన ఉత్పత్తికే ప్రోత్సాహకం చెల్లించాలని పిపిఎలలో పొందుపరిచారు.

ఈక్విటీతో ప్రోత్సాహకం రేటును ముడిపెట్టడం హేతువిరుద్ధం, వివక్షాపూరితం. అదనంగా చేసే ఉత్పత్తిలో తేడాతో నిమిత్తం లేకుండా ప్రాజెక్టు వ్యయంలో ఈక్విటీ శాతం ఎంత ఎక్కువగా వుంటే అంత ఎక్కువగా ప్రోత్సాహకాన్ని పొందడానికి వీలు కలుగుతుంది. ఇంకా దారుణమైన విషయమేమంటే జివికె, స్పెక్ట్రం ప్రాజెక్టులకు డీమ్డ్ జనరేషన్‌పై కూడా ప్రోత్సాహకాన్ని చెల్లించాలి!

జివికె 2వ దశ, గౌతమి, వేమగిరి, కోనసీమ ప్రాజెక్టులకు స్థిర ఛార్జీలను విదేశీ అప్పు సర్వీసు ఛార్జీ (ఎఫ్ డి ఎస్ సి), ఇతర స్థిర ఛార్జి (ఒ ఎఫ్ సి) గా విభజించారు. 80 శాతం నుండి 90 పిఎల్ఎఫ్ వరకు ఉత్పత్తికి యూనిట్‌కు ఒఎఫ్‌సిలో 25 శాతం మొత్తాన్ని ప్రోత్సాహకంగా నిర్ణయించారు. జివికె ప్రాజెక్టు (216 మె.వా)కు ఒకరకమైన ప్రోత్సాహకాన్ని, అదే ప్రాజెక్టు రెండవదశ (220 మె.వా) కు మరో రకమైన ప్రోత్సాహకాన్ని నిర్ణయించారు. మొదటిదశ 216 మె.వా ప్రాజెక్టుకు 68.5 శాతం నుండి 90 శాతం పిఎల్ఎఫ్ వరకు ఉత్పత్తికి ప్రతి ఒక శాతం పిఎల్ఎఫ్‌కు ఈక్విటీ రూ. 244.80 కోట్లలో 0.525 శాతం ప్రోత్సాహకం కింద రూ. 27.6318 కోట్లు లభిస్తుంది. అదే ప్రాజెక్టు రెండవదశకు 80 శాతం నుండి 90 శాతం పిఎల్ఎఫ్ వరకు ఉత్పత్తికి యూనిట్‌కు ఒఎఫ్‌సి రూ. 0.6999లో 25 శాతంగా రూ. 0.17475 చొప్పున ప్రోత్సాహకం లభిస్తుంది. 10 శాతం పిఎల్ఎఫ్ ఉత్పత్తికి ఈ ప్రోత్సాహకం మొత్తం రూ. 30.30 లక్షలు అవుతుంది. జివికె ప్రాజెక్టు రెండవదశ ప్రాజెక్టుకు నిర్ణయించిన ప్రోత్సాహకంతో పోల్చితే ఆ ప్రాజెక్టు మొదటిదశకు, స్పెక్ట్రం ప్రాజెక్టుకు ప్రోత్సాహకాన్ని ఎంత నిలువు దోపిడీ చేసే రీతిలో నిర్ణయించిందీ అర్థమవుతుంది.

**ఈక్విటీపై 16 శాతం లాభం**

ప్రాజెక్టు పెట్టుబడిలో 70 శాతం రుణం, 30 శాతం ఈక్విటీగా వుండాలని నిర్ణయించి, ఈక్విటీపై ఏటా 16 శాతం లాభాన్ని చెల్లించాలని పిపిఎలలో పొందుపరిచారు. దీనికి 38.66 శాతం ప్రోత్సాహకాన్ని కలిపితే, జిలికె, స్పెక్ట్రం ప్రాజెక్టులు నాలుగేళ్ళలోనే తమ ఈక్విటీ మొత్తాన్ని రాబట్టుకొనేందుకు వీలుకల్పించినట్టయింది! ఆ తరువాత కాలమంతా కూడా ఏటా 24.66 శాతం మొత్తాన్ని లాభం, ప్రోత్సాహకాల రూపంలో వినియోగదారులను నిలువుదోపిడీ చేయటమే. ఈక్విటీపై 16 శాతం లాభానికి హేతుబద్ధ ప్రాతిపదిక

లేదు. 1990 దశకం ప్రారంభంలో వడ్డీరేట్లు 16 నుండి 20 శాతం దాకా వున్నాయన్న సాకుతో ఈ లాభం రేటును నిర్ణయించారు. వడ్డీరేట్లు తరువాత క్రమేణా తీవ్రంగా పడిపోయినప్పటికి ఈ ప్రాజెక్టులు 16 శాతం లాభాన్ని పొందుతూనే వున్నాయి. డాలరు ద్రవ్యోల్బణం రూపాయికన్నా చాలా తక్కువగా వుంటున్నందుకు

డాలర్లలో పెట్టిన ఈక్విటీ పెట్టుబడిపై 16 శాతం లాభాన్ని ఇవ్వటం అసలే సమర్థనీయం కాదు.

**పెట్టుబడిలో విదేశీ మారక ద్రవ్యం**

ప్రాజెక్టు మొత్తం పెట్టుబడి వ్యయంలో విదేశీ మారక ద్రవ్యం వుంటే, దానికి సంబంధించిన రుణం భాగాన్ని, ఈక్విటీపై లాభాన్ని చెల్లించేనాటికి వున్న డాలరుతో రూపాయి మారకం రేటు ప్రకారం సర్దుబాటు చేసి చెల్లించాలని పిపిఎలలో పొందుపరిచారు. అసలు, వడ్డీని అప్పు తీరేదాకా చెల్లించాల్సి వుండగా, ఈక్విటీపై లాభాన్ని పిపిఎ కాలం ముగిసేవరకు చెల్లించాలి. ఇలాంటి అవాంఛనీయ ఏర్పాటువల్ల, డాలరుతో రూపాయిమారకం విలువ పడిపోతున్నకొద్దీ ఒకపక్క ప్రాజెక్టు పెట్టుబడి వ్యయం, మరోపక్క అప్పు, వడ్డీ, ఈక్విటీపై లాభంగా చెల్లించాల్సిన మొత్తాలు పెరిగిపోతాయి. ఉదాహరణకు, 1994 జూలైలో 500 మె.వా.ల బిపిఎల్ ప్రాజెక్టుకు రూ. 1852.40 కోట్ల పెట్టుబడి వ్యయం (మె.వా.కు రూ. 3.70 కోట్లు) అవుతుందని ఇచ్చిన సాంకేతిక, ఆర్థిక అనుమతిలో ప్రాజెక్టు పెట్టుబడిని 326.8 మిలియన్ డాలర్ల రూపంలోను, 1228.92 కోట్ల రూపాయలలోను అనుమతించారు. బిపిఎల్ ఈ పెట్టుబడిని మార్చింది. డాలర్లలో పెట్టుబడిని 480.71 మిలియన్లకు పెంచి, రూపాయలలో పెట్టుబడిని 559.44 కోట్లకు తగ్గించింది. ఈ మార్పుల వల్ల ప్రాజెక్టు పెట్టుబడి రూ. 2876.44 కోట్లకు (మె.వా.కు రూ. 5.53 కోట్లు) పెరిగింది. మొదటి ప్రతిపాదించిన పెట్టుబడి వ్యయం మె.వా.కు రూ. 3.70 నుండి చివరకు రూ. 5.53 కోట్లకు పెరిగింది. అనగా మె.వా.కు తేడా రు. 1.83 కోట్ల చొప్పున 520 మె.వా.లకు అంచనా పెట్టుబడి వ్యయం రూ. 951.60 కోట్ల మేరకు అదనంగా పెరిగింది. ఎపిజెన్‌కో కు చెందిన శ్రీశైలం ఎడమగట్టు జలవిద్యుత్ ప్రాజెక్టును జపాన్ అంతర్జాతీయ సహకార బ్యాంకు నుండి పొందిన రుణంతో అమలు చేశారు. పదేళ్ళ కాలంలో జపాన్ ఎన్‌లో రూపాయి మారకం విలువ పడిపోయినందున ప్రాజెక్టు వ్యయం రూ. 1000 కోట్ల దాకా పెరిగిందని జెన్‌కో మాజీ సిఎండి వెల్లడించారు. చెల్లించే నాటికి వున్న డాలరుతో రూపాయిమారకం విలువను సర్దుబాటు చేసి చెల్లింపులు చేసేందుకు అంగీకరించడం వినియోగదారులపై భారీగా అదనపు భారాలను మోపుతుంది. ఇలాంటి ఏర్పాటు అవాంఛనీయం ఒక బహుళజాతి సంస్థ విదేశీ మారక ద్రవ్యంతో రుణాన్ని, ఈక్విటీ సమకూర్చుకొని మనదేశంలో ఒక పరిశ్రమను నెలకొల్పితే, రూపాయి మారకం విలువను ఎప్పటికప్పుడు సర్దుబాటు చేసే రీతిలో ఆ సంస్థ పెట్టుబడిని వెనక్కు పొందలేదు. రూపాయిలలో ఆర్జించిన ఆదాయాన్ని, లాభాలను ఆ సంస్థ తన స్వదేశానికి తరలించుకొంటే రూపాయి మారకం విలువ ఆ నాటికి పడిపోయిన మేరకు ఆ సంస్థ లాభదాయకత తగ్గుతుంది. ఆ తగ్గుదలకు ఎవరూ సర్దుబాటు చేయరు.

**మెరిట్ ఆర్డర్ డిస్పాచ్ వక్రీకరణ**

డీమ్డ్ జనరేషన్, దానిపై కూడా ప్రోత్సాహకాన్ని చెల్లించాలన్న నిబంధనలు మెరిట్ ఆర్డర్ డిస్పాచ్ వక్రీకరణకు దారితీస్తున్నాయి. మెరిట్ ఆర్డర్ డిస్పాచ్ అంటే అతి తక్కువ ఛార్జీకి లభించే విద్యుత్‌ను ముందు కొనుగోలు చేసి, ఆ క్రమంలో వివిధ ప్రాజెక్టుల నుండి విద్యుత్‌ను కొనుగోలు చేయటం. అయితే, యూనిట్‌కు అయ్యే ఛార్జీనిబట్టి గాక అస్థిర ఛార్జీల ఆధారంగానే నియంత్రణ కమీషన్ మెరిట్ ఆర్డర్‌ను నిర్ణయిస్తున్నది. దీనివల్ల, ఒక ప్రాజెక్టు స్థిర ఛార్జీ అధికంగా వున్నా, అస్థిర ఛార్జీ తక్కువగా వుండి, మొత్తం ఛార్జీ అధికంగా వున్నా మెరిట్ ఆర్డర్‌లో అది ముందు వస్తుంది. స్థిర ఛార్జీ, మొత్తం ఛార్జీ తక్కువగా వున్నా, అస్థిర చార్జీ ఎక్కువగా వున్న ప్రాజెక్టు మెరిట్ ఆర్డర్ క్రమంలో తరువాత వస్తుంది. ఉదాహరణకు, 2002-03 సంవత్సరానికి ఎపిట్రాన్స్‌కో నియంత్రణ కమీషన్‌కు సమర్పించిన వార్షిక ఆదాయ అవసరాల ప్రతిపాదనలలో జివికె, స్పెక్ట్రం, లాంకో, సంప్రదాయేతర ఇంధన వనరుల ప్రాజెక్టుల నుండి 6385 మి.యూ.లను కొనుగోలు చేసేందుకు రూ. 1491.70 కోట్లు చెల్లించాలని చూపింది. ఎపిజెన్‌కో, కేంద్ర విద్యుత్ ప్రాజెక్టులు, వైజాగ్ స్టీల్‌ప్లాంట్‌ల నుండి 6397 మి.యూ. లను కొనుగోలు చేసేందుకు రూ. 1130.23 కోట్లు చెల్లించాలని చూపింది. ప్రైవేటు ప్రాజెక్టునుండి కొనుగోలు చేసే ఖరీదైన విద్యుత్‌ను మెరిట్ ఆర్డర్‌లోను, ప్రభుత్వ ప్రాజెక్టులనుండి కొనుగోలు చేసే చవకైన విద్యుత్‌ను మిగులుగాను ట్రాన్స్‌కో చూపింది. ప్రైవేటు ప్రాజెక్టుల నుండి విద్యుత్‌ను కొనకపోతే డీమ్డ్ జనరేషన్ కింద స్థిర ఛార్జీలుగా రూ. 715 కోట్లను, జివికె, స్పెక్ట్రంలకు ప్రోత్సాహకంగా రూ. 37 కోట్లు ట్రాన్స్‌కో చెల్లించాలి. డీమ్డ్ జనరేషన్, దానిపై ప్రోత్సాహకాన్ని కూడా చెల్లించాల్సిన నిబంధనలవల్ల ఖరీదైన విద్యుత్ చవకైనది గాను, చవక విద్యుత్ మిగులుగాను పరిగణించబడే పరిస్థితి నెలకొంటున్నది.

**ఇంధన సమస్య**

విద్యుత్ ప్రాజెక్టులకు అవసరమైన గ్యాస్ లభ్యతలేదని, గ్యాస్ ధరలు 107 శాతం పెరిగే అవకాశముందని, నాఫ్తా వంటి ప్రత్యామ్నాయ ఇంధనాలను వాడితే విద్యుత్ ఛార్జీలు చాలా అధికంగా పెరుగుతాయని, అవసరానికి మించి ప్రాజెక్టుల స్థాపక సామర్థ్యాన్ని పెంచితే డీమ్డ్ జనరేషన్ కింద భారీగా స్థిర ఛార్జీలను చెల్లించాల్సి వస్తుందని తెలిసి కూడా గత చంద్రబాబునాయుడు ప్రభుత్వం నాలుగు ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులతో పిపిఎలు చేయించింది.

1997లో చేసుకున్న ఈ ఒప్పందాల ప్రకారం ప్రాజెక్టుల నిర్మాణానికి గడువు ముగిసినా వాటినుండి దాదాపు రూ. 450 కోట్ల నష్టపరిహారం (లిక్విటేటెడ్ డామేజెస్) వసూలు చేయకుండా ఆ ప్రభుత్వం వాటి స్థాపక సామర్థ్యాన్ని పెంచుకొనేందుకు అనుమతించింది. వాటికితోడు అమలుగడువునుకూడా పొడిగించింది. అవి గౌతమి, వేమగిరి, కోనసీమ, జివికె 2వ దశ ప్రాజెక్టులు. కృష్ణా గోదావరి బేసిన్‌లో, రవ్వక్షేత్రంలో గ్యాస్ లభ్యత తగ్గిపోతోందని, 2002 జనవరి 22న అప్పటి పెట్రోలియం, సహజవాయువు శాఖ కార్యదర్శి విజయేంద్రకౌల్ అప్పటి రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పి.వి.రావుకు రాసిన లేఖలో తెలిపారు. రాష్ట్రంలో అమలు జరిగిన, అమలుకానున్న గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్రాజెక్టులకు రోజుకు 16.85 మిలియన్ ప్రామాణిక ఘనపు మీటర్ల (ఎంసిఎండి) గ్యాస్ 2004-05లో అవసరంకాగా, లభ్యత 12.5 ఎంసిఎండి మాత్రమే వుంటుందని ఆ లేఖలో స్పష్టం చేశారు. అప్పటికే అమలులో వున్న గ్యాస్ ఆధారిత ప్రాజెక్టులకు తగినంత గ్యాస్ సరఫరా గాని పక్షంలో నాఫ్తాతో ఉత్పత్తి చేయాల్సి వస్తుందని, నాఫ్తాతో విద్యుత్ ఉత్పత్తి చేస్తే యూనిట్‌కు ఇంధన వ్యయం రూ.3.08 అవుతుందని (గ్యాస్‌తో 79 పైసలు అవుతుంది) అప్పటి ముఖ్యమంత్రి ఎన్. చంద్రబాబునాయుడు అప్పటి కేంద్ర విద్యుచ్ఛక్తి శాఖమంత్రి సురేష్‌ప్రభుకు 2002 ఏప్రియల్ 3న రాసిన లేఖలో తెలిపారు. నాఫ్తాపై ఎక్సైజ్ సుంకాన్ని మినహాయించాలని కోరుతూ, అలాచేస్తే, ఇంధన వ్యయం యూనిట్‌కు రూ. 2.66 అవుతుందని చంద్రబాబు ఆ లేఖలో తెలిపారు. ఆ నాలుగు ప్రాజెక్టుల పిపిఎలపై విద్యుత్ నియంత్రణ కమీషన్ నిర్వహించిన బహిరంగ విచారణ సందర్భంగా, వాటివల్ల వచ్చే నష్టాలను వివరిస్తూ లేవనెత్తిన అభ్యంతరాలను, చేసిన ప్రత్యామ్నాయ సూచనలను ప్రభుత్వం, దాని ఆదేశం మేరకు ఎపి ట్రాన్స్‌కో, నియంత్రణ కమీషన్ పట్టించుకోలేదు. ఆ ప్రాజెక్టుల వల్ల డిమాండుకు మించి అధిక స్థాపక సామర్థ్యం మిగులు తేలి చౌకగా విద్యుత్‌ను ఉత్పత్తి చేసే ఇతర ప్రాజెక్టులు మెరిట్ ఆర్డర్ కింద మూతపడే ప్రమాదం వస్తుంది. గ్యాస్ లభ్యత తగినంతగా లేకపోతే, ప్రత్యామ్నాయ ఇంధనాలను విద్యుత్ ఉత్పత్తికి వాడితే స్థిర ఛార్జీల రూపంలో గాని, అధిక ఛార్జీల రూపంలో గాని వినియోగదారులపై భారీగా నివారించదగిన అదనపు భారం పడుతుంది. గ్యాస్ ధరలు కేంద్ర కేబినెట్ కమిటీ సిఫార్సు చేసిన విధంగా 107 శాతం పెరిగితే విద్యుత్ ఛార్జీల పెంపుదలవల్ల వినియోగదారులపై అదనపు భారం పడుతుంది. అయినప్పటికి నియంత్రణ కమీషన్ ఆ పిపిఎలకు ఆమోదం తెలిపింది.

2007-08 నాటికి 14 శాతం రిజర్వు మార్జిన్‌తో (అవసరమైన దానికన్నా మించిన అదనపు స్థాపక సామర్థ్యం) రాష్ట్రంలో విద్యుత్ డిమాండును తీర్చేందుకు 2405 మె.వా.ల స్థాపక సామర్థ్యాన్ని అదనంగా చేర్చితే సరిపోతుందని 2002 ఏప్రియల్‌లో ఎపి ట్రాన్స్‌కోకు లోడ్ ఫోర్ కాస్ట్ (భవిష్యత్‌లో విద్యుత్ అవసరాలపై అంచనాలు) పై ఇచ్చిన సంజాయిషీ నోటీసులో నియంత్రణ కమీషన్ పేర్కొంది. ఆ ఏడాది జూలై 29న ఇచ్చిన ఉత్తర్వులో దీనిని 3180 మె.వా. లకు పెంచింది. తిరిగి 2003 ఏప్రియల్ 8న ఇచ్చిన ఉత్తర్వులో దీనిని 5182 మె.వా. లకు, రిజర్వ్ మార్జిన్‌ను 29 శాతానికి నియంత్రణ కమీషన్ పెంచింది. నియంత్రణ కమీషన్ కోరగా సిఇఎ లోడ్ ఫోర్ కాస్ట్‌పై ఇచ్చిన నివేదికలో వెలిబుచ్చిన వాటిలో కొన్ని ఎంపిక చేసిన అభిప్రాయాలు, అంచనాలను కమీషన్ తన నిర్ణయాలకు ఆధారంగా చూపింది.

1499 మె.వా.ల సామర్థ్యం గల పై నాలుగు ప్రాజెక్టుల పిపిఎలకు ఆమోదం తెలుపుతూ నియంత్రణ కమీషన్ వేసిన అంచనాల ప్రకారం, గ్యాస్ ధరలు 1000 ప్రామాణిక ఘనపు మీటర్లకు (ఎస్‌సిఎం) రూ. 7400లకు పెరిగితే, గ్యాస్ ఆధారిత ప్రాజెక్టులు ఉత్పత్తి చేసే విద్యుత్‌కు యూనిట్‌కు అస్థిర ఛార్జీలు దాదాపు 80 పైసలనుండి రూ. 1.50కి పెరుగుతాయి. 80 శాతం పిఎల్ఎఫ్‌తో ఈ ప్రాజెక్టులు ఉత్పత్తి చేసే 11682 మి.యూ.ను కొనుగోలు చేయడానికి అదనంగా రూ. 817.76 కోట్ల మొత్తాన్ని అస్థిర ఛార్జీలకింద చెల్లించాల్సి వస్తుంది. ఇదిగాక, జివికె, స్పెక్ట్రం, ల్యాంకో, కొండపల్లి ప్రాజెక్టులనుండి 5551 మి.యూ.లను కొనుగోలు చేసేందుకు అదనంగా రూ. 388.57 కోట్ల మేరకు అస్థిర ఛార్జీలను చెల్లించాల్సి వస్తుంది. బొగ్గు ఆధారిత ప్రాజెక్టుల విద్యుత్ అస్థిర ఛార్జీలలో పోల్చినా, కమీషన్ అంచనాల ప్రకారం గ్యాస్ ఆధారిత ప్రాజెక్టుల నుండి 17233 మి.యూ.లను కొనుగోలు చేసేందుకు రు. 671.18 కోట్ల మొత్తం ఎక్కువ అవుతుంది.

ప్రాజెక్టులు గెయిల్ (ఇండియా) లిమిటెడ్‌తో గ్యాస్ సరఫరాకు చేసుకున్న ఒప్పందాలు, ఎపిట్రాన్స్‌కో ఈ ప్రాజెక్టులతో చేసుకున్న పిపిఎల ప్రభావం ఇలా వుంది. ఈ ప్రాజక్టులు విద్యుత్ ఉత్పత్తికి సంసిద్ధతను వ్యక్తం చేసినపుడు, విద్యుత్ అవసరం లేకగాని, ఇతర అవసరాలవల్ల గాని ఉత్పత్తి చేయవద్దని ఎపిట్రాన్స్‌కో ఆదేశించవచ్చు. అలాంటి పరిస్థితిలో డీమ్డ్ జనరేషన్ కింద ట్రాన్స్‌కో పూర్తి స్థిర ఛార్జీలను చెల్లించాలి. రెండవది, గ్యాస్ లభ్యత లేక గెయిల్ సరఫరా చేయకపోతే చాలా అధిక వ్యయమయ్యే నాఫ్తావంటి ప్రత్యామ్నాయ ఇంధనాలను ప్రాజెక్టులు విద్యుత్ ఉత్పత్తికి వాడవచ్చు. అయితే, పిపిఎలలోని నిబంధన ప్రకారం అందుకు ఎపి ట్రాన్స్‌కో అనుమతి పొందాలి. ప్రత్యామ్నాయ ఇంధనంతో ఉత్పత్తి చేయడానికి ట్రాన్స్‌కో అంగీకారం తెలిపితే, అధిక అస్థిర ఛార్జీలను ప్రాజెక్టులకు చెల్లించాలి.

(మిగతాది 13వ పేజీలో)

# విద్యుత్ చట్టం-2003: పర్యవసానాలు

- కె. రఘు

విద్యుత్‌రంగానికి సంబంధించి ప్రస్తుతం ఉన్న చట్టాల స్థానే వచ్చిన విద్యుత్ చట్టం-2003 విద్యుత్‌రంగ స్వరూప స్వభావాలను సమూలంగా మార్చబోతుంది. విద్యుత్ చట్టం-2003 కు ముందు మూడు ముఖ్యమైన చట్టాలు ఉన్నాయి. ఇందులో మొదటిది, ఇండియన్ ఎలక్ట్రిసిటి చట్టం 1910. ఇది బ్రిటీష్‌వారి హయాంలో చట్టరూపం దాల్చింది. పంపిణీ రంగంలో ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో లైసెన్సులు ఇవ్వడానికి ఈ చట్టం రూపొందింది. రెండవది, విద్యుత్ సరఫరా చట్టం 1948. స్వతంత్ర భారతంలో విద్యుత్‌రంగం అన్ని ప్రాంతాలలో అభివృద్ధి చెందే ఉద్దేశ్యంతో ఈ చట్టం రూపొందించబడింది. ఈ చట్ట ఫలితంగా అన్ని రాష్ట్రాలలో విద్యుత్ బోర్డులు ఏర్పడ్డాయి. మన రాష్ట్రంలో 1999 వరకూ ప్రజలకు సేవలందించిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్‌బోర్డు (ఎపిఎస్ఇబి) ఈ చట్ట ఫలితంగానే 1961లో స్థాపించబడింది. మూడవది, సంస్కరణలనేపథ్యంలో రూపొందించబడిన ఎలక్ట్రిసిటి రెగ్యులేటర్ కమీషన్ చట్టం 1998. ఈ చట్టం ఫలితంగా సెంట్రల్ ఎలక్ట్రిసిటి రెగ్యులేటర్ కమీషన్ (సిఇఆర్‌సి) ఏర్పడింది. ఇది కేంద్ర విద్యుత్ సంస్థల విద్యుత్ ఛార్జీలను నియంత్రిస్తుంది. ఇదేకాక ఈ చట్ట ఫలితంగా అప్పటికీ రెగ్యులేటర్ కమీషన్‌లులేని రాష్ట్రాలలో రెగ్యులేటరీ కమీషన్లు ఏర్పాటు చేసుకొనే అవకాశం కలిగింది.

పై మూడు చట్టాలను తొలగిస్తూ విద్యుత్‌రంగంలో కీలకమైన మార్పులకు తెరతీస్తూ విద్యుత్ చట్టం-2003 జూన్10, 2003న రూపు దాల్చింది. ఈ చట్టంలో 185 సెక్షన్లు, 23 విభాగాలు ఉన్నాయి. ఈ చట్టం ముఖ్యంగా కీలకమైన మార్పులు తెస్తుంది. ఇందులో విద్యుత్ ఉత్పత్తికి, సరఫరాకు మరియు పంపిణీ రంగాలకు సంబంధించి చెరేసి రెండు మార్పులున్నాయి.

**ఉత్పత్తిరంగంలో మార్పులు:**

1) లైసెన్సు విధానానికి స్వస్తి: ప్రస్తుతం ఏ ఉత్పత్తి కేంద్రాన్ని పెట్టాలన్నా ప్రభుత్వ లైసెన్సు తప్పని సరి. అంతేకాక సెంట్రల్ ఎలక్ట్రిసిటీ అధారిటి (సిఇఎ) వారి నుండి సాంకేతిక, ఆర్థిక అంగీకారం (Techno Economic Clearance-TEC) కావాలి. అయితే విద్యుత్ చట్టం-2003 పై పద్ధతులకు స్వస్తిపలికి ఎవరంటే వారు ఎటువంటి లైసెన్సు లేకుండా ఉత్పత్తి కేంద్రం నిర్మించుకునేందుకు అవకాశం కల్పిస్తుంది.

2) కాప్టివ్ ఉత్పత్తి: కాప్టివ్ ఉత్పత్తిపై ఇంతవరకూ ఉన్న ఆంక్షలన్నీ ఈ చట్టంతో తొలగిపోతాయి. ఎవరంటే వారు కాప్టివ్ ఉత్పత్తి కేంద్రాన్ని లైసెన్సు లేకుండా నిర్మించి నడుపుకోవచ్చు. అంతే కాకుండా కాప్టివ్ విద్యుత్ నిర్వచనం మార్చడం జరిగింది. ఇప్పటివరకూ ఎవరికి వారు తమ అవసరాలపై విద్యుత్తును ఉత్పత్తి చేసుకోవడాన్ని 'కాప్టివ్ ఉత్పత్తి' అనేవారు. అయితే క్రొత్తచట్టం ప్రకారం కొంతమంది వ్యక్తులు 'అసోషియేషన్' గా గాని, 'కో ఆపరేటివ్' గా గాని ఏర్పడి ఉత్పత్తి చేసే విద్యుత్‌ను కూడా ఈ నిర్వచనం పరిధిలోకి తీసుకొచ్చారు.

**సరఫరారంగంలో మార్పులు:**

1) ట్రాన్స్‌కో లైన్లను (నెట్ వర్క్‌ను) అందరికీ అందుబాటులో ఉంచడం (Non-discriminetory open Access): క్రొత్త విద్యుత్ చట్టం ప్రకారం ట్రాన్స్‌కో తన లైన్లు, సబ్‌స్టేషన్ల ద్వారా ఏ ఉత్పత్తి కేంద్రం నుండి ఉత్పత్తి అయిన విద్యుత్తునయినా సరఫరా చేయడానికి అనుమతించాలి. ఈ మేరకు ఆయా ఉత్పత్తి కేంద్రాలు ట్రాన్స్‌కోకు వీలింగ్ (Wheeling) ఛార్జీలు చెల్లించి తమతమ వినియోగదారులకు నేరుగా విద్యుత్తును అమ్ముకోవచ్చు.

2) ట్రాన్స్‌కో కొనుగోలు, అమ్మకాలకు (Trading) దూరం. క్రొత్తచట్టం ప్రకారం ట్రాన్స్‌కో భవిష్యత్తులో విద్యుత్తు కొనుగోలు, అమ్మకాలకు దూరంగా ఉండాలి. అంటే కేవలం విద్యుత్తును సరఫరా చేయడానికే పరిమితం కావాలి. అంటే కొనుగోలు, అమ్మకాల (Trading) బాధ్యతను ఇంకో క్రొత్త కంపెనీకి గాని లేదా ఇప్పటికే వున్న పంపిణీ సంస్థలకు గాని అప్పగించారన్న మాట!

**పంపిణీ రంగంలో మార్పులు:**

1) ఒకే ప్రాంతంలో ఎన్నో కంపెనీలు/సమాంతర నెట్‌వర్క్‌లు: ప్రస్తుతం ఒక ప్రాంతంలో ఒకే డిస్ట్రిబ్యూషన్ కంపెనీ పనిచేయడానికి ఆస్కారం ఉంది. క్రొత్త చట్టం ప్రకారం ఒకే ప్రాంతంలో ఒకటికి మించి డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు పనిచేసే ఆస్కారం ఉంది. కొత్తగా రావాలనుకున్న కంపెనీలు రెగ్యులేటరీ కమీషన్ ద్వారా లైసెన్సుపొంది తమ స్వంత లైన్లను వేసుకుని విద్యుత్తును వినియోగదారులకు పంపిణీ చేయవచ్చు.

2) గ్రామీణ ప్రాంతాలలో ప్రత్యేక వ్యవస్థలు (Stand Alone Systems in Rural Areas): ఎవరైనా ఎటువంటి లైసెన్సు లేకుండా గ్రామీణ ప్రాంతాలలో విద్యుత్ ఉత్పత్తి చేసి ఆ ఉత్పత్తిను అక్కడే పంపిణీ చేయవచ్చు.

పైమార్పులనే కాకుండా మరికొన్ని ముఖ్యమైన మార్పులను ఈ క్రొత్త విద్యుత్ చట్టం తెస్తుంది. ప్రస్తుతం రెగ్యులేటరీ కమీషన్ నిర్ణయాలపై హైకోర్టుకు అప్పీళ్ళకు వెళ్ళవచ్చు. క్రొత్త చట్టం అమలులోకి వచ్చిన తరువాత కమీషన్ నిర్ణయాలపై అప్పీళ్ళకు హైకోర్టుకు కాకుండా, దీనికై ప్రత్యేకంగా ఏర్పరచిన అప్పలేట్ ట్రిబ్యునల్ (Appellate Tribunal)కు వెళ్ళవలసి ఉంది. అప్పలేట్ ట్రిబ్యునల్ నిర్ణయాలపై అప్పీళ్ళకు సుప్రీంకోర్టును ఆశ్రయించాల్సి ఉంటుంది. ఇంకా కొత్త చట్టం సబ్సిడీలను, క్రాస్ సబ్సిడీలను

దశలవారిగా, పూర్తిగా ఎత్తివేయాలని నిర్దేశించింది.

**కొత్త చట్టపు పర్యవసానాలు:**

విద్యుత్ చట్టం-2003 వినియోగదారులపై, విద్యుత్ సంస్థలపై తీవ్ర ప్రభావం చూపనుంది. సబ్సిడీలను, క్రాస్ సబ్సిడీలను క్రమేపీ పూర్తిగా ఎత్తివేయాలని క్రొత్తచట్టం నిర్దేశిస్తున్నా అది ఆచరణలో ఎంతవరకూ సాధ్యమనేది ప్రశ్నార్థకమే! విద్యుత్ చట్టం-2003 రాకమునుపే మన రాష్ట్రంలో ఆంధ్రప్రదేశ్ విద్యుత్ సంస్కరణల చట్టం 1998 ఆధారంగా సంస్కరణలు ప్రవేశించాయి. ఈ చట్టం కూడ సబ్సిడీ, క్రాస్ సబ్సిడీలను క్రమక్రమంగా ఎత్తివేయాలని నిర్దేశించింది. అయితే అందులో విద్యుత్ చట్టం-2003లో ఉన్న కాప్టివ్ ఉత్పత్తికి సంబంధించిన క్లాజులు, ట్రాన్స్‌కో/డిస్కమ్‌లు తమ నెట్‌వర్క్‌ను తప్పనిసరిగా ఎవరడిగితే వారికి ఇవ్వాలనే ఓపెన్ యాక్సెస్ క్లాజులు లేవు. అందుకే మన రాష్ట్రంలోని రెగ్యులేటరీ కమీషన్‌కు క్రాస్ సబ్సిడీలను పరిస్థితులకు అనుగుణంగా తగ్గించే వెసులుబాటు ఉండింది. కాని క్రొత్త చట్టం ప్రకారం ట్రాన్స్‌కో డిస్కమ్‌లకు ఎక్కువ ఆదాయాన్ని అందించే పెద్ద పరిశ్రమలు, రైల్వేలు డిస్కమ్‌లను వదిలివేసి స్వంతంగా కాప్టివ్‌ప్లాంట్లు పెట్టుకోవడమో లేదా వేరే ఉత్పత్తి సంస్థల వద్ద లేక విద్యుత్ ట్రేడింగు కంపెనీల వద్ద విద్యుత్తును కొనడమో చేసే అవకాశం వుంది.

పెద్ద వినియోగదారులు (పరిశ్రమలు, రైల్వేలు వగైరా) ట్రాన్స్‌కో, డిస్కమ్‌లను వదలివేస్తే పర్యవసానాలు క్రింది విధంగా ఉంటాయి.

1) ట్రాన్స్‌కో/డిస్కమ్‌ల ఆదాయం పడిపోయి ఉత్పత్తి సంస్థలకు చెల్లింపులు కష్టమవుతాయి. అయితే ప్రైవేటు ఉత్పత్తి సంస్థలతో కుదుర్చుకున్న పిపిఎలలో పొందుపరచిన ఎస్క్రో(Escrow) లేదా లెటర్-ఆఫ్-క్రెడిట్ సదుపాయాల కారణంగా వారికి తప్పనిసరిగా చెల్లింపులు చేయబడతాయి. కాని ఈ సదుపాయాలు లేని జెన్‌కో యూనిట్లకు చెల్లింపులు కష్టమౌతాయి.

2) ట్రాన్స్‌కో/డిస్కమ్‌ల ఆదాయం పడిపోవడంతో చిన్న వినియోగదారులకు (గృహ, వ్యవసాయరంగాలు) అంతే క్రాస్ సబ్సిడీలు తగ్గి వీరిపై ఛార్జీలు పెరిగే అవకాశం వుంటుంది.

3) మన రాష్ట్రంలో ట్రాన్స్‌కో ఇప్పటికే అనేక ప్రైవేటు ఉత్పత్తి సంస్థలతో పిపిఎ లు కుదుర్చుకుంది. ఈ పిపిఎ లు కుదుర్చుకోవడానికి ముఖ్యకారణం భవిష్యత్‌లో విద్యుత్ కొనుగోళ్ళు పెరుగుతాయనేదే! అయితే పెద్ద వినియోగదారులు నిష్క్రమించడంతో ఈ కొనుగోళ్ళు తగ్గుతాయి. ఇంకా క్రాస్ సబ్సిడీలు తగ్గి చిన్న వినియోగదారులపై ఛార్జీలు పెరిగితే వీరి వినియోగం కూడ తగ్గే అవకాశం ఉంది. అయితే ఇప్పటికే కుదుర్చుకున్న పిపిఎల కారణంగా ట్రాన్స్‌కో/డిస్కమ్‌లు ప్రైవేటు ఉత్పత్తిదారులనుండి తప్పనిసరిగా విద్యుత్ కొనుగోలు చేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. లేదా ఆ మేరకు ఫిక్స్‌డ్ ఛార్జీలను చెల్లించవలసి వస్తుంది. ఈ ఫిక్స్‌డ్ ఛార్జీల భారం సబ్సిడీరూపంలో ప్రభుత్వం పైనో లేదా ఛార్జీల రూపంలో చిన్న వినియోగదారులమీదనో పడనుంది.

పంపిణీ రంగంలో ఒకే ప్రాంతంలో సమాంతర నెట్‌వర్క్‌లను అనుమతించే క్లాజు ప్రభావం పట్టణ ప్రాంతాలకే పరిమితమయ్యే అవకాశం ఉంది. ఎందుకంటే పరిమితమైన స్థలంలో ఎక్కువ వినియోగ దారులుండటమే కాకుండా, పంపిణీ కంపెనీలకు ఆదాయాన్నిచ్చే పరిశ్రమలు, హోటళ్ళు, సినిమా థియేటర్లు మొదలైన వర్గాలు ఆ ప్రాంతాలలోనే అధికం. ఇంకా ప్రైవేటు పంపిణీ సంస్థలు స్వంత నెట్‌వర్క్‌లతో తమ సరఫరా కేవలం పెద్ద వినియోగదారులకే పరిమితం చేసే అవకాశం వుంది. దీనికే "చెర్రీ పికింగ్") (Cherry picking) అంటారు. దీనితో ట్రాన్స్‌కో/డిస్కమ్‌ల ఆదాయం గణనీయంగా పడిపోయే అవకాశం వుంది. తిరిగి ఇది చిన్న వినియోగ దారులపైనే తీవ్రమైన పరిణామం చూపిస్తుంది.

మరోవైపు గ్రామీణ ప్రాంతాలలో ప్రత్యేక విద్యుత్ వ్యవస్థల (Stand Alone Systems in Rural Areas) క్లాజు కారణంగా, ఈ ప్రాంతాలలో ఎక్కడెక్కడ పెద్ద వినియోగదారులు అధికంగా ఉంటారో అలాంటి చోట్ల ఈ వ్యవస్థలు వచ్చే అవకాశం వుంది. ఇది కూడ ప్రభుత్వ పంపిణీ వ్యవస్థల ఆదాయంపై ప్రతికూల ప్రభావం చూపనుంది.

విద్యుత్ చట్టం-2003 లో పొందుపరచిన ఓపెన్ యాక్సెస్ వలన ట్రాన్స్‌కో/డిస్కమ్‌లు పెద్ద వినియోగదారులకు (1 మెగావాట్ కంటె ఎక్కువ విద్యుత్తును ఉపయోగించుకొనేవారు) ఇతర సంస్థల నుండి విద్యుత్ కొనుగోలు చేస్తే సబ్సిడీ తగ్గి రాష్ట్ర ప్రభుత్వంపై సబ్సిడీ భారం పెరిగే అవకాశం వుంది. పరిశ్రమలు, రైల్వేలు తదితర కొన్ని కేటగిరీల వినియోగదారుల నుండి డిస్కమ్‌లు కరెంటు సరఫరా చేయడానికి అయ్యే ఖర్చు కన్నా ఎక్కువ మొత్తాన్ని ఛార్జీల రూపంలో రాబడతాయి. అలా ఎక్కువ వచ్చిన మొత్తాన్ని మిగతా చిన్న వినియోగదారులపై ఛార్జీలభారం తగ్గించడానికి వినియోగిస్తాయి. ఓపెన్ యాక్సెస్ అమలులోనికి వస్తే పరిశ్రమలు, రైల్వేల వంటి పెద్ద వినియోగదారులు డిస్కమ్ నుండి కాక ఇతరుల వద్దనుండి విద్యుత్తు కొనే అవకాశం వుంది. అటువంటి పరిస్థితిలో వీరినుండి లభ్యమయ్యే క్రాస్ సబ్సిడీ తగ్గి ప్రభుత్వం మీద, సామాన్య ప్రజల మీద భారం పెరిగే అవకాశం వుంది. రైతులకు, గృహ వినియోగదారులకు ప్రస్తుతము లభ్యమవుతున్న క్రాస్ సబ్సిడీ రు.1,476.21 కోట్లు. ఓపెన్ యాక్సెస్ అమలయితే డిస్కమ్‌లకు అందే ఈ అదనపు ఆదాయం తగ్గుతుంది. అప్పుడు అవి ఈ భారాన్ని వినియోగదారులపై తప్పనిసరిగా మోపవలసి వుంటుంది. అయితే ప్రభుత్వం ఉచిత విద్యుత్ నిర్ణయించినందువల్ల వినియోగదారులపై భారం మోపే అవకాశం లేదు. మరి ఈ భారాన్ని ఎవరు భరించాలి? సహజంగానే ప్రభుత్వం అదనపు సబ్సిడీ రూపంలో ఈ డబ్బును కూడ డిస్కమ్‌లకు అందించాల్సి ఉంటుంది. అంటే 2005లో మొదలై 2008 నాటికి పూర్తిస్థాయిలో అమలులోకి వచ్చే 'ఓపెన్ యాక్సెస్' విధానం క్రమేపీ ప్రభుత్వంపై లేదా వినియోగదార్లపై సబ్సిడీల భారాన్ని అధికం చేస్తుందన్న మాట!

# విద్యుత్ రంగంలో ఆదా చేసే మార్గాలు

(పీపుల్స్ మానిటరింగ్ గ్రూప్ ఆన్ ఎలక్ట్రిసిటీ రెగ్యులేషన్ ముఖ్యమంత్రికి సమర్పించిన పత్రంలో చేసిన సూచనలను ఈ దిగువ ఇస్తున్నాం-సం)

ఏ.పి. ట్రాన్స్‌కో, డిస్కమ్‌ల రుణభారాన్ని పునర్వ్యవస్థీకరించటం ద్వారా గణనీయమైన స్థాయిలో ఆదా చేయవచ్చు. ప్రతీ సంవత్సరం వడ్డీ భారం పెరుగుతూంది. మార్కెట్‌లో వడ్డీరేట్లు తగ్గుతున్నాయి కాబట్టి వడ్డీభారం తగ్గివుండాలి. ఎక్కువ వడ్డీ రుణాలను తక్కువ వడ్డీ రుణాలతో పరాటా చేసుకోవచ్చునని ఎపిఇఆర్‌సి (కమీషన్ అని వ్యవహరిద్దాం) సూచించింది. అయినా, లైసెన్సుదారులు ఎక్కువ వడ్డీ చెల్లిస్తూ పోతున్నారు.

ఎపిట్రాన్స్‌కో రుణాల పరాటా కారణంగా రు.60 కోట్లు ఆదా చేసినా, వడ్డీభారం కమీషన్ నిర్దేశించిన స్థాయికన్నా 03-04లో ఎనిమిది కోట్లు (రు.359 కో. నుంచి రు. 367కో.) పెరిగింది. 04-05లో వడ్డీ మరో రు.25 కోట్లు పెరిగి, రు. 392 కోట్లకు చేరుకొంటుంది.

### డిస్కమ్‌ల వడ్డీ చెల్లింపులు

(రు. కోట్లు)

| | 2003 | 2004(ఎపిఇఆర్‌సి) | 2004 అంచనా | 2005 అంచనా |
|---|---|---|---|---|
| ఇపిడిసిఎల్ | 35 | 51 | 67 | 66 |
| ఎస్‌పిడిసిఎల్ | 90 | 82 | 103 | 101 |
| సిపిడిసిఎల్ | 132 | 130 | 187 | 199 |
| ఎన్‌పిడిసిఎల్ | 74 | 78 | 93 | 90 |
| మొత్తం | 331 | 341 | 450 | 456 |

డిస్కమ్‌ల వడ్డీభారం కూడా ఎక్కువేనని పై పట్టిక తెలియచేస్తుంది. అది ప్రతీ సంవత్సరం పెరుగుతూంది కూడా. పరాటా చేసే అవకాశాన్ని ట్రాన్స్‌కో తానే ఉపయోగించుకొన్నదని, తాము తీసుకొన్న రుణాలను ట్రాన్స్‌కో ఏర్పాటు చేసిందని, ఆ సంస్థ తమ వడ్డీల సంగతి పట్టించుకోలేదని డిస్కమ్‌ల వాదన. కాని డిస్కమ్‌లు స్వతంత్ర సంస్థలు; వాటి వ్యవహారాలన్నిటికే వారే బాధ్యత వహించాలి కాబట్టి బాధ్యత ఇతరుల మీదకు నెట్టివేయడానికి వీలులేదు. వడ్డీభారాన్ని వారే తగ్గించుకోవాలి. రాష్ట్ర ప్రభుత్వం వారికి సహాయం అందిస్తే వడ్డీభారం తగ్గి నిధులు ఆదా అవుతాయి. వ్యవసాయదారుల పాత బాకీలు రద్దు అయ్యాయి కాబట్టి, ఈ భారం తగ్గుతుంది. అయితే, వ్యవసాయేతర వినిమయదారుల బాకీలు గణనీయంగా వున్నాయి.

### డిస్కమ్‌ల బాకీలు

(రు.కోట్లు)

| | 2003 | 2004 | 2005 |
|---|---|---|---|
| ఇపిడిసిఎల్ | 105.03 | 133.97 | 164.72 |
| ఎస్‌పిడిసిఎల్ | 226.92 | 314.41 | 373.59 |
| సిపిడిసిఎల్ | 651.77 | 993.18 | 1363.75 |
| ఎన్‌పిడిఎల్ | 380.78 | 490.23 | 606.52 |
| మొత్తం | 1364.50 | 1931.79 | 2508.58 |

ఈ బాకీల వివరాల్లోకి పోయి చూస్తే, బాకీలు ఎక్కువగా హైటెన్షన్ వినియోగదారులనుంచే రావాల్సినవని కనపడుతుంది. ఈ బాకీలు సంవత్సరం నుంచి పేరుకుపోయాయి. వారి సంఖ్య కూడా చాలా తక్కువ. కాబట్టి వసూళ్లు పకడ్బందీగా చేస్తే ఆదాయం సమకూడుతుంది. కొన్ని బాకీలు కోర్టుకేసుల్లో వున్నాయని, వాటి విషయంలో కోర్టు తీర్పులు తమకనుకూలంగా వచ్చాయని, వసూళ్లు జరుగుతున్నాయని డిస్కమ్‌ల వాదన. కాని వాస్తవాలు ఇందుకు వ్యతిరేకంగా వున్నాయి. గత సంవత్సరం కోర్టుకేసుల బాకీలు రు.79.63 కోట్లయితే, ఈ సంవత్సరం రు. 101.11 కోట్లకు పెరిగాయి. దీనర్థం ఒకటే: వసూలు చేయదలచుకోలేదు; లేదా వసూళ్లు చేయటంలేదు.

తీసేసిన కరెంటు కనెక్షన్ల వినిమయదారులనుంచి రు.360కోట్లు బాకీలు రావాల్సినవి వున్నాయి. వీటి వసూళ్లకు డిస్కమ్‌లు ప్రయత్నం చేస్తున్నట్లు కనపడదు.

**ఉద్యోగుల వ్యవహారం**

ట్రాన్స్‌కో, డిస్కమ్‌లలో ఉద్యోగులసంఖ్య తగ్గుతూండగా, జీతాలభారం పెరుగుతూంది. అదెలా జరుగుతుంది? ఈ పెరుగుదల కూడా అనూహ్యంగా వుంది.

02-03లో ట్రాన్స్‌కో జీతభత్యాలు రు 65కోట్లు; తర్వాత సంవత్సరంలో రు.71 కోట్లు; 04-05లో రు. 111 కోట్లకు పెరగనుంది. ఇదే సమయంలో ఉద్యోగులసంఖ్య తగ్గింది. వచ్చే అయిదేళ్ళలో ఉద్యోగులసంఖ్య 4723 నుంచి 4058 కి తగ్గనుంది. అయినా, జీతాలభారం ఎందుకు పెరిగిందో తెలియదు. డిస్కమ్‌ల పరిస్థితీ అలాగేవుంది. జీతభత్యాలు 2003లో రు.626 కోట్లనుంచి 2005లో రు.739 కోట్లకు పెరగనున్నాయి. ఈ సంస్థలో మంజూరైన పోస్టుల్లో కూడా నియామకాలు జరగలేదు. ఉదాహరణకు సిపిడిసిఎల్ లెక్కల ప్రకారం ప్రతీ నూరు కనెక్షన్లకు నలుగురు ఉద్యోగులుండాల్సి వుండగా

వాస్తవంలో 2.7 మందే వున్నారు. మరిన్ని వివరాలలోకి పోయి చూస్తే ఆఫీసర్ల పోస్టులన్నీ భర్తీ అవుతుండగా కిందిస్థాయి ఉద్యోగులస్థానాలు భర్తీ కావటంల లేదు. పాత సంస్థ ఎపిఎస్ఇబిలో కేవలం తొమ్మిది మందే డైరెక్టర్లుండగా ఇపుడు ఈ సంస్థలన్నింటినీ కలిపి చూస్తే 50 మంది వున్నారు. విద్యున్మండలిని ముక్కలు ముక్కలుగా చేయటంవల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. ఇది చాలదన్నట్లు, ప్రతీచోటా కన్సల్టెంట్ల రాజ్యం వచ్చింది; మస్తుగా జీతాలు చెల్లిస్తున్నారు.

పక్కనేవున్న ఒరిస్సా ప్రభుత్వం చెప్పినదాని ప్రకారం ఈ కన్సల్టెంట్ల జీత భత్యాలే రు.100 కోట్లు! కాగా ఈ కన్సల్టెంట్లను ఇంటికి పంపించేస్తే బోలెడంత సొమ్ము ఆదా అవుతుంది.

**ఇ-సేవ**

వినిమయదారులకు ఇది అదనపు సౌకర్యం నిజమే. కాని, ప్రస్తుత బిల్లు కలెక్టర్ల వ్యవస్థకింద ప్రతీ బిల్లు వసూలుకు అయ్యే ఖర్చు 60 నుంచి నూరు పైసలు మాత్రమే కాగా ఇ-సేవ కింద ప్రతీ బిల్లుకు అయ్యే ఖర్చు అయిదు రూపాయలు. పైగా ఇది వరకు రెండు నెలలకోసారి బిల్లు వసూలు చేస్తుండగా ఇపుడు ప్రతీనెలా వసూలు కావటంతో ఖర్చు పదిరూపాయలవుతుంది. ఈ భారం వినిమయదారునిమీద పడదు, ప్రభుత్వమే భరిస్తుందని జవాబు. ప్రభుత్వంమాత్రం ఎందుకు ఈ భారాన్ని భరించాలి?

ఎత్తిపోతల పథకాలకు బోలెడంత విద్యుచ్ఛక్తి ఖర్చు అవుతుంది. బావులు తవ్వుకొన్నవారికి, వీరికి మధ్య తేడా వుంది. ఈ విషయాన్ని రైతులతో చర్చించి, ఆదా అయ్యే మార్గం గురించి ఆలోచించాలి.

ఉచితంగా విద్యుచ్ఛక్తి ఇస్తే, ఎక్కువ వృధా అవుతుందనే వాదన వుంది. దీనిని నివారించాలంటే ప్రతీ పంపుసెట్‌కు ఇంత విద్యుత్ వాడకం అని సీలింగ్‌పెట్టి ఆపైన వాడితే, దాని పూర్తి ఛార్జీలు వసూలు చేయవచ్చు. ప్రతీ పంపుసెట్‌కు మీటర్‌లేదు కాబట్టి, కొంతమంది రైతుల సముదాయానికి వారి భూముల విస్తీర్ణంబట్టి, అవసరమైన మేరకు దాటి వాడకం చేస్తే ఆ రైతులదే బాధ్యతగా నిర్దేశించవచ్చు. ఫేజ్‌లు మారిస్తే, చర్యలు తీసుకోవాలి. విద్యుచ్ఛక్తి వాడకం తగ్గితే, అలా తగ్గించిన వారికి ప్రోత్సాహకాలు ఇవ్వవచ్చు. ఆదా చేసే ప్రతీ యూనిట్‌కు డిస్కమ్‌లకు రెండు రూపాయలు ఆదా అవుతుంది. పంపుసెట్ల నాణ్యత లోపంవల్ల 30-40 శాతం మేరకే అవి శక్తినిస్తున్నాయి. ఈ లోపాన్ని సరిదిద్దుకొన్న రైతుకు కూడా ప్రోత్సాహకాన్ని ప్రకటించవచ్చు. ఇందుకు రైతు సంఘాల సహకారాన్ని కోరాలి; ట్రాన్స్‌ఫార్మర్ లేదా సబ్-స్టేషన్ స్థాయిలో రైతుల కమిటీ ఏర్పాటు చేసి, దుర్వ్యయాన్ని అరికట్టవచ్చు. ఇదివరకటి ప్రభుత్వం వ్యవసాయదారుల విద్యుత్ వాడకం గురించి ఒక టాస్క్‌ఫోర్స్ ఏర్పాటు చేయగా, ఆ కమిటీ నివేదికను సమర్పించింది. అందులో మంచి సూచనలను అమలు చేయవచ్చు.

విద్యుత్ ఉచితంగా వస్తుందని అదేపనిగా బోర్లు వేసుకోవడాన్ని నియంత్రించాలి. నూతన విద్యుత్ సరఫరా విధానాన్ని రచించే కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది కాబట్టి పై సూచనలను గణణంలోకి తీసుకోవాలని కోరుతున్నాం



(9వ పేజీ తరువాయి)

పత్యామ్నాయ ఇంధనాన్ని వాడవద్దంటే విద్యుత్‌ను ఉత్పత్తి చేయకుండానే ప్రాజెక్టులకు ట్రాన్స్‌కో పూర్తి స్థిర ఛార్జీలను చెల్లించాలి. ఆ విధంగా ముందు నుయ్యి, వెనుక గొయ్యి పరిస్థితులు ఇలాంటి ఏకపక్ష నిబంధనలవల్ల ట్రాన్స్‌కో ఎదుర్కొంటుంది.

ఇలాంటి అధిక చెల్లింపుల అదనపు భారాన్నంతటిని ఇంధన సర్ ఛార్జి సర్దుబాటు (ఎఫ్ ఎస్ ఎ) కింద వినియోగదారుల నుండి వసూలు చేసేందుకు విద్యుత్ నియంత్రణా కమీషన్ అనుమతినిస్తుంది. కేటాయించిన గ్యాస్‌ను ప్రాజెక్టులకు సరఫరా చేయకపోతే దానివల్ల ఏర్పడేది స్కూలకు పెట్రోలియం, సహా జవాబు మంత్రిత్వశాఖ గాని, ఓఎన్‌జిసి గాని, గెయిల్ గాని, ప్రాజెక్టుల యాజమాన్యాలుగాని, ఎపిట్రాన్స్‌కో గాని, పిపిఎలు చేయించిన ప్రభుత్వం గాని ఎదుర్కొనవు.

సవరించిన పిపిఎలలో అంగీకరించిన విధంగా గౌతమి, జివికె 2వదశ, వేమగిరి, కోనసీమ ప్రాజెక్టులు వచ్చే ఏడాది నిర్మాణాన్ని పూర్తి చేసుకుని వాణిజ్యపరంగా ఉత్పత్తిని ప్రారంభించాల్సి వుంది. అయితే, అప్పటికి గెయిల్ నుండి ఈ ప్రాజెక్టులకు గ్యాస్ సరఫరా ప్రారంభమయ్యే అవకాశం లేదని, 2006 చివరివరకు కూడా ఆ అవకాశం లేదని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రం నుండి తెలుసుకొంది. అలాంటి పరిస్థితిలో, డీమ్డ్ జనరేషన్ కింద ఏడాదికి రూ. 1020 కోట్ల మేరకు నాలుగు ప్రాజెక్టులకు స్థిర ఛార్జీలను చెల్లించాల్సి వస్తుందని ప్రభుత్వం ఆందోళన చెందుతున్నది. భరించలేని ఈ అధికభారాన్ని నివారించేందుకు ప్రభుత్వం నాలుగు ప్రాజెక్టుల యాజమాన్యాలతో చర్చలు జరుపుతున్నది. ప్రాజెక్టు వాణిజ్య పరంగా ఉత్పత్తి ప్రారంభించే గడువును ఏడాది పాటు వాయిదా వేసుకోవాలని, ప్రత్యామ్నాయ ఇంధనాన్ని ఆ కాలంలో వాడరాదని, అస్థిర ఛార్జీలను అకాలంలో కోరరాదని ప్రభుత్వం ప్రతిపాదించింది. వేమగిరి ప్రాజెక్టు ఈ ప్రతిపాదనలకు అంగీకరించిందని ఆర్థికమంత్రి కె.రోశయ్య ప్రకటించారు. మిగిలిన మూడు ప్రాజెక్టులతో కూడా ఈ ప్రతిపాదనలను అంగీకరింపజేసేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. జివికె, స్పెక్ట్రం, లాంకో ప్రాజెక్టుల పిపిఎలను సవరించేందుకు సూచనలు చేయడానికి రోశయ్య అధ్యక్షతన ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. ఎపిట్రాన్స్‌కో అధికారులతో సమావేశం జరిపి ఈ పిపిఎలలో ఎలాంటి మార్పులు చేయించాలనే దానిపై ఆ సంస్థ సూచనలను కమిటీ తెలుసుకొంది. వాస్తవానికి, ఈ పిపిఎలను సవరించాలని కోరుతూ ఎపిట్రాన్స్‌కో గత ఎన్నికలకు ముందే నియంత్రణ కమీషన్ ముందు రివ్యూ పిటీషన్లను దాఖలు చేసింది. పిపిఎలను సమీక్షించేందుకు కమీషన్‌కున్న అధికారాన్ని సవాలు చేస్తూ ప్రాజెక్టుల యాజమాన్యాలు హైకోర్టు నుండి స్టే ఉత్తర్వును పొందాయి. రోశయ్య కమిటీ ప్రాజెక్టుల యాజమాన్యాలతో చర్చలు జరపనుంది.



# మరో రాజ్యాంగ సవరణ అవసరం

-వి.భాస్కరరావు
సెంటర్ ఫర్ పీపుల్స్ ఎంపవర్‌మెంట్ అండ్ గుడ్ గవర్నెన్స్, వరంగల్

('పంచాయత్‌రాజ్ ఇన్ ఇండియా' పత్రంలో ఇది రెండవభాగాన్ని ఈ కింది ఇస్తున్నాం-సం)

**పశ్చిమబెంగాల్:**

పంచాయితీరాజ్ వ్యవస్థను విజయవంతంగా అమలు జరుపుతున్న రాష్ట్రం పశ్చిమ బెంగాల్. గత 25 సంవత్సరాలుగా, ఇక్కడి మార్క్సిస్ట్ కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యంలోని వామపక్ష ప్రభుత్వం-రాజకీయ అధికారాన్ని కొనసాగింప చేసుకోవడంలో పంచాయితీరాజ్ వ్యవస్థకు గల ప్రాధాన్యతను గుర్తించి, నిరూపించింది. ధనిక, మధ్య తరగతి రైతాంగం సహకారంతో భూ సంస్కరణలను చేపట్టడం ద్వారా ఇక్కడ పంచాయితీ వ్యవస్థను సమర్ధవంతంగా అమలు జరపడం సాధ్యమయింది. తద్వారా 1984 నుంచి అధికారం, వనరులు అందుబాటులోకి రావడానికి అవకాశం ఏర్పడింది.

భారత దేశంలోనే మొట్టమొదటిసారిగా, ఎన్నికయిన స్థానిక సంస్థలే, అధికారయంత్రాంగం కంటే స్థానికంగా శక్తివంతమయ్యాయి. నూతన పంచాయితీరాజ్ చట్టం ప్రకారం, సక్రమంగా ఎన్నికలు జరుగుతున్నాయి. చట్టంలో పేర్కొన్న 25 అంశాలనే పంచాయితీలకు బదిలాయించారు. 12 అంశాలకు సంబంధించిన నిధులను కూడా పంచాయితీలకు మళ్లించారు. మొత్తం అభివృద్ధి అధికారులందరినీ జిల్లా పంచాయితీ సంస్థ పరిధిలోకి తేవడమే కాక, ఈ 12 అంశాలకు సంబంధించిన పరిపాలనా సిబ్బంధిని కూడా బదిలీ చేశారు.

**మధ్యప్రదేశ్:**

కాంగ్రెస్‌పార్టీ ఆధ్వర్యంలోని రాష్ట్ర ప్రభుత్వం రాజ్యాంగ అవసరాల మేరకు పంచాయితీ రాజ్ చట్టాన్ని ఆమోదించింది. పంచాయితీ ఎన్నికలు నిర్వహిస్తోంది. పంచాయితీలకు నిధులను బదిలీ చేసింది. ఇప్పుడు ప్రతిగ్రామానికీ ఒక 'గ్రామ్ ఖోష్' (గ్రామ ఖజానా) ఏర్పడింది. వాటిలో 60 వేలనుంచి 70 వేలమంది రూపాయల దాకా అభివృద్ధి నిధులు అందుబాటులో ఉంటున్నాయి. 'గ్రామసభ' సహకారంతో గ్రామస్థులు స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకొంటున్నారు. 'ప్రజలకీ అధికారం' అన్న ప్రభుత్వం విధానం, సాంఘిక సంక్షేమ సంస్కరణలు, దారిద్ర్య నిర్మూలన మొదలైనవన్నీ కలిసి, 'ప్రజల్ని పరిపాలించడం' స్థానంలో, 'ప్రజలే పరిపాలించడం' అనే విధానాన్ని నెలకొల్పడానికి తోడ్పడ్డాయి.

ప్రజల సమస్యలను పరిష్కరించడంలో స్థానిక స్వపరిపాలన ద్వారా ప్రజల భాగస్వామ్యాన్ని కల్పించడం అనే రాష్ట్ర, నాయకత్వ ధృక్పధమే ఈ మార్పుకు కాననమయింది.

**కేరళ:**

కేరళలో 1995లో జరిగిన పంచాయితీ ఎన్నికల్లో, సిపిఎం నాయకత్వంలోని వామపక్ష ప్రజాస్వామ్య కూటమి అత్యధిక స్థానిక సంస్థలలో ఆధిక్యత పొందింది. ప్రభుత్వం, పంచాయితీల అధికారాలను ప్రణాళికలలో ప్రజా భాగస్వామ్యాన్ని అభివృద్ధి పరచింది. పంచాయితీలకు రాష్ట్ర బడ్జెట్‌లో 35 నుంచి 40 శాతం దాకా నిధులను కేటాయించడంలో, అలాగే వాటికి 29 అంశాలను బదలాయింపు చేయడంలో కేరళ మొట్టమొదటి రాష్ట్రంగా నిలచింది. స్థానికస్థాయిలో, అవసరాల ప్రాతిపదికగా ప్రణాళికా కార్యక్రమాలను రూపొందించమని రాష్ట్ర ప్రభుత్వం స్థానిక స్వయం పరిపాలనా సంస్థలను కోరింది. 1996 ఆగష్టు 17న కేరళ ప్రభుత్వం, పంచాయితీరాజ్ సంస్థలకు సాధికారత కల్పించడంకోసం, 'ప్రణాళికా వికేంద్రీకరణ'కు ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించింది. ఆరు దశలుగా సాగిన ఈ ఉద్యమంలో, వేలాది అధికారులు, నిపుణులు, ముప్పై లక్షలమంది ప్రజలు భాగస్వామ్యం వహించడం ద్వారా 'ప్రజా ప్రణాళికా విధానం' విజయవంతమయిందని ప్రకటించారు. ప్రజల అవసరాలను గుర్తించడంలో 'గ్రామ సభ'లను చైతన్య పరచారు. ఆరంభ దశల్లో ఎదురైన అవరోధాల కారణంగా, ప్రజా ప్రణాళికా విధానం, వికేంద్రీకరణల ధృక్పధం ప్రణాళికా ప్రక్రియను స్పష్ట పరచింది. ప్రజాప్రణాళికా ప్రక్రియ చేపట్టాక ఆర్థిక పరిస్థితి మెరుగుపడింది.

**గుజరాత్:**

పంచాయితీరాజ్‌కు మూల పురుషులైన మహాత్మగాంధీ, బల్వంతరాయ్ మెహతా, అశోక్ మెహతా వంటి వారికి గుజరాత్ రాష్ట్రం పుట్టినిల్లు. కాని ఆ రాష్ట్రం ఇటీవలి సంవత్సరాలలో రాజ్యాంగ స్ఫూర్తితో పనిచేయడంలేదు. ప్రస్తుత పాలకపార్టీకి కిందిస్థాయి ప్రజాస్వామ్యంపట్ల గల అయిష్టతే అందుకు కారణం. 1960లకు ముందు ఈ రాష్ట్రం పంచాయితీరాజ్ కార్యక్రమాలకు పెట్టింది పేరుగా ఉండేది.

**రాజస్థాన్:**

1959లో పంచాయితీరాజ్ వ్యవస్థను అమలు పరచిన

మొట్టమొదటి రాష్ట్రం రాజస్థాన్. కాని సవరణ చట్టం ప్రకారం, ఆ రాష్ట్రంలో ఇటీవల (2003) మాత్రమే, మొత్తం 29 అంశాలను, నిధులతో, కార్యక్రమాలతో, కార్యనిర్వాహక సిబ్బందితో సహా పంచాయితీరాజ్ సంస్థలకు బదిలీ చేయాలని నిర్ణయించారు. ఎంతోకాలం నుంచి ఎదురు చూస్తున్న ఈ చర్య పంచాయితీరాజ్ స్థితిగతులను బలోపేతం చేసింది. పంచాయితీరాజ్ సంస్థలకు మనుగడగల గ్రామాభివృద్ధిని సాధించే సాధికారతను కల్పించింది. నూతన తరహా పరిపాలనలో, గ్రామీణాభివృద్ధి బాధ్యతలను జిల్లా పరిషత్‌లకు అప్పగిస్తూ, వాటిలోనే జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థలను కలిపివేశారు. రాష్ట్ర ప్రభుత్వ గ్రామీణాభివృద్ధి శాఖను కూడా పంచాయితీరాజ్ శాఖలో విలీనం చేశారు. నిర్వహణాయంత్రాంగాన్ని కూడా జిల్లా పరిషత్‌లకు, వాటి ప్రధానుల నియంత్రణలోకి తెచ్చారు. స్థానికంగా తమకు లభించే ఆదాయవనరులను వినియోగించుకునేందుకు ప్రస్తుతం పంచాయితీలకు పూర్తి హక్కులు ఉన్నాయి.

**ఆంధ్రప్రదేశ్:**

1959లో పంచాయితీరాజ్ వ్యవస్థను ప్రవేశపెట్టిన రెండవ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. మొదటితరం పంచాయితీ వ్యవస్థను పునరుద్ధరించిన కొన్ని రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ కూడా ఒకటి. ప్రాంతీయపార్టీ అయిన తెలుగుదేశం హయాంలో ఈ మార్పులు జరిగాయి. నిరంతర రాజకీయ సంకల్పాన్ని కొనసాగిస్తూ, ప్రజలవద్దకు పాలనను తీసుకు వెళ్ళేందుకు చర్యలు చేపట్టింది. పునరావృత్త పద్ధతిలో మహిళలకు, బలహీనవర్గాలకు పంచాయితీరాజ్ సంస్థలలో రిజర్వేషన్లను కల్పించింది.

కొత్త పంచాయితీరాజ్ సంస్థలు 1994లో అమలులోకి వచ్చి, ఎన్నికలు జరిగాయి. ఎన్నికల కమీషన్, ఫైనాన్స్ కమీషన్లను ఏర్పాటు చేశారు. కాని చాలా కాలం నుంచి కేవలం 20 అంశాలను మాత్రమే పంచాయితీలకు బదలాయించారు. అయినా నిర్వహణా సిబ్బందిని బదిలీ చేయలేదు. నిధులను కూడా పూర్తిగా బదలాయించలేదు. జిల్లా ప్రణాళికా కమిటీలను నియమించలేదు. సవరణకు అతీతంగా రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక చట్టం ద్వారా అనేక కమిటీలను నియామకం చేసింది. ఈ ప్రత్యేక కమిటీలకు, పంచాయితీరాజ్ సంస్థలకు మధ్య సమన్వయం లేదు. పంచాయితీరాజ్ సంస్థల నిధులను ఈ ప్రత్యేక కమిటీల కార్యక్రమాలకు మళ్ళించారు. వాటిలో ఎన్నికయిన ప్రజా ప్రతినిధులకు ఎలాంటి ప్రాతినిధ్యం కల్పించలేదు.

1997 జనవరి 1వ తేదీనుంచి 'జన్మభూమి' అనే పథకం పేరిట ఒక సామూహిక గ్రామీణాభివృద్ధి కార్యక్రమాన్ని చేపట్టారు. పాలకపార్టీ తెలుగుదేశంకి చెందిన నాయకులు, కార్యకర్తలు దాదాపు 18 విడతలుగా ప్రజల్ని నేరుగా కలుసుకొని, రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగంతో, పంచాయితీ నిధులతో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టారు. స్థానిక ప్రజాస్వామ్యం లేకుండానే ఒక తరహా అధికార వికేంద్రీకరణ అమలు జరిగింది.

'స్థానిక ప్రభుత్వాలు' ఏర్పాటు చేయడం కోసం ఏర్పడిన 'లోక్ సత్తా' అనే సంస్థ సహకారంతో, పంచాయితీలు, జిల్లా పరిషత్‌ల ప్రతినిధులు 2003లో ఒక సమాఖ్యగా ఏర్పడి స్థానిక సంస్థలకు సాధికారత సాధించేందుకు ఒక ఉద్యమం చేపట్టారు. 1992 చట్టం ప్రకారం పంచాయితీలకు అన్ని అధికారాలు బదలాయించాలని కోరుతూ మిలియన్ సంతకాల సేకరణ ఉద్యమాన్ని తీవ్రంగా నిర్వహించారు.

ఒరిస్సా రాష్ట్రంలో 1997 జనవరిలోనే కొత్త పంచాయితీలు ఎన్నికయ్యాయి.. 1995లోనే చట్టం అమలులోకి వచ్చినప్పటికీ ఎలాంటి అభివృద్ధీ జరగలేదు.

బీహార్ రాష్ట్రంలో 2001 వరకూ ఎన్నికలే జరగలేదు. న్యాయపరమైన ఆదేశాలకారణంగా అధికారాలను బదిలీ చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం విముఖంగా ఉంది.

చట్టప్రకారం 29 అంశాలనూ పంచాయితీలకు బదిలీ చేసిన రాష్ట్రాలలో కర్ణాటక ఒకటి. ఆ రాష్ట్ర పంచాయితీ ఉద్యమానికి గల గత చరిత్ర కారణంగా ఎంతో అభివృద్ధి జరిగినట్టు తెలుస్తోంది. తమిళనాడులో పాలకపార్టీలు-డిఎంకె ఎఐఎడిఎంకె లు రెండూ కూడా పంచాయితీ రాజ్ సంస్థలకు అధికారం పంచి ఇవ్వడానికి సుముఖంగా లేవు. ఆ రాష్ట్రంలో పంచాయితీరాజ్ సంస్థలు చెప్పకోదగిన అభివృద్ధి సాధించలేదు.

అస్సాం రాష్ట్రంలో 11 అంశాలను పంచాయితీలకు బదలాయించారు. పంజాబ్ రాష్ట్రం ఈ అంశాలను పంచాయితీలకు కట్టబెట్టడంలో చొరవ చూపుతుంది. చిన్న రాష్ట్రాలయిన గోవా, పాండిచేరి, త్రిపుర, మేఘాలయ, మిజోరాం, నాగాలాండ్‌లలో ఎలాంటి పురోగతి లేదు.

**ఒక అభివృద్ధి దశాబ్దం:**

ప్రపంచంలోనే అతిపెద్ద ప్రయోగమైన వికేంద్రీకృత పరిపాలన ప్రారంభించి పది సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా ఎక్కడా ఎలాంటి ఉత్సవాలూ జరగలేదు. పంచాయితీలకు అధికార సంక్రమణ ప్రక్రియ ఎక్కడిదక్కడే నిలిచిపోయిన సందర్భంగా, మరింత సాధికారతకు, మరికొన్ని రాజ్యాంగ సవరణలకు హామీ ఇచ్చారు. ప్రభుత్వాలకు సంకల్పశుద్ధి లేనందువల్ల పంచాయితీలు అనవసరంగా మిగిలిపోయాయని అనేక అధ్యయనాలు

వెల్లడిస్తున్నాయి.

క్లుప్తంగా చెప్పాలంటే-పంచాయితీలకు నిధులు, విధులు, యంత్రాంగం లేవు. గ్రామీణాభివృద్ధి జాతీయ సంస్థ (ఎన్ఐఆర్డి) 19 రాష్ట్రాలలో పంచాయితీలపై జరిపిన ఒక అధ్యయనం దేశంలోని మొత్తం రాజకీయ పార్టీలన్నీ పంచాయితీరాజ్ సంస్థల అధికారాలను అభివృద్ధి పరిచేందుకు అయిష్టంగా ఉన్నాయని స్పష్టంచేస్తోంది.

పంచాయితీ రాజ్ వ్యవస్థలో అధికారలోపానికి గల కారణాలు:

1. ఇంకా నాలుగు రాష్ట్రాలలో పంచాయితీ ఎన్నికలు జరగనే లేదు.
2. 24 రాష్ట్రాలు పంచాయితీలకు నిర్వాహణాధికారాలను బదిలీ చెయలేదు.
3. పంచాయితీలకు ఆర్థిక ప్రతిపత్తి లేదు.
4. వికేంద్రీకృత పణాళికలు రూపొందించేందుకు గాను ఇంకా 12 రాష్ట్రాలలో జిల్లా ప్రణాళికా కమిటీలను నియమించవలసి ఉంది.
5. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు (ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, కేరళ) పంచాయితీరాజ్ సంస్థలకు సమాంతరంగా విభిన్న వ్యవస్థలను పెంపొందించాయి.

పంచాయితీరాజ్ సంస్థలకు అధికారాలు సంక్రమింపచేసే విషయంలో రాష్ట్రాలు సాధించిన అభివృద్ధి సమీక్షించేందుకు, కేంద్ర ప్రభుత్వం 2002 డిసెంబర్లో, పంచాయితీరాజ్ సంస్థలకు ఆర్థిక, నిర్వాహణాధికారులపై ఒక సాధికారత కలిగిన ఉపసంఘాన్ని నియమించింది. అన్ని రాష్ట్రాలలో జిల్లా ప్రణాళికా కమిటీలను ఏర్పరచాలని, అవి ఖరారు చేసిన జిల్లా ప్రణాళికలే రాష్ట్ర, జాతీయ స్థాయి ప్రణాళికలకు ప్రాతిపధికగా ఉండాలని సబ్కమిటి అభిప్రాయపడింది.

**సమానాంతర సంస్థలు:**

పంచాయితీలకు అధికారాలు పూర్తిగా అభివృద్ధి పరచకపోవడంతోబాటు, అభివృద్ధి కార్యక్రమాల పేరిట రాష్ట్ర ప్రభుత్వాలు అనేక గ్రామస్థాయి వినియోగ బృందాలను కూడా నెలకొల్పడంతో పరిస్థితి మరింత అధ్వాన్నంగా మారింది. ఆ బృందాలన్నీ పంచాయితీరాజ్ సంస్థలతో ప్రమేయం లేకుండానే స్వతంత్రంగా వ్యవహరిస్తున్నాయి. రాజ్యాంగంలోని 11వ షెడ్యూల్ ప్రకారం పంచాయితీలకు సంక్రమించిన అంశాలలో సైతం అవి జోక్యం చేసుకుంటున్నాయి. గ్రామ అటవీ సంఘాలు, స్వయం సహాయక బృందాలు, నీటి వినియోగదారుల సంఘాలు, వాటర్ షెడ్ అభివృద్ధి బృందాలు, విద్యాకమిటీల వంటి వినయోగదారుల సంఘాలు ఏర్పడ్డాయి. ఆంధ్రప్రదేశ్లో 'జన్మభూమి' గుజరాత్లో 'సంయుక్త అటవీ యాజమాన్యం' వంటి కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. అలాగే హర్యానాలో 'వికృస్ సమితి' హిమాచల్ ప్రదేశ్లో 'విజిలెన్స్ కమిటీలు', ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్లలో 'నీటి వినియోగదారుల సంఘాలు-ఏర్పడ్డాయి. ఇలాంటి వినియోగదారుల సంఘాలు, కార్యక్రమాలన్నీ పంచాయితీలకు ఎన్నికయిన ప్రజా ప్రతినిధులను కలుపుకోకుండానే పంచాయితీల నిధులను వినియోగించుకొంటున్నాయన్న ఆరోపణలున్నాయి. ఈ తరహా పద్ధతులు పంచాయితీరాజ్ వ్యవస్థకు సమాంతరంగా అభివృద్ధి చెందుతున్నాయి. ప్రజాస్వామ్యయుతంగా పంచాయితీలకు ఎన్నికయిన ప్రజాప్రతినిధుల అధికారాలను కత్తిరిస్తూ ఆంధ్రప్రదేశ్లో నోడల్ అధికారుల వ్యవస్థవలె అధికారుల పరిపాలనను రుద్దడం జరుగుతుంది.

**సాధికారతా ఉద్యమం:**

దేశవ్యాప్తంగా ఉన్న పంచాయితీల అధినేతలందరూ 2002 మార్చిలో ఢిల్లీలో సమావేశమయ్యారు. పంచాయితీ వ్యవస్థ నిర్లక్ష్యానికి గురవుతున్న తీరుపై వారంతా తమ నిరసనను వ్యక్తం చేయడమే కాక, 73వ సవరణను అమలులోకి తెచ్చుందుకు గడువు విధించారు. రాష్ట్ర ప్రభుత్వాలు రాజ్యాంగ సవరణ స్ఫూర్తి మేరకు పంచాయితీసంస్థలకు నిధులను, విధులను, యంత్రాంగాన్ని బదలాయించాలని డిమాండ్ చేశారు. 2002 ఆగష్టులో పాట్నాలోని బీహార్ హైకోర్టు పంచాయితీలకు తగిన అధికారాలు బదిలీ చేయనందుకు గాను రాష్ట్ర ప్రభుత్వానికి అభిశంశించింది. 2002లో ఆంధ్రప్రదేశ్లోని జిల్లా పరిషత్ల అధినేతలు రాష్ట్ర హైకోర్టులో రాష్ట్ర ప్రభుత్వం రాజ్యాంగ సవరణను అమలుపరచాలని కోరుతూ కేసువేశారు. పంచాయితీ సంస్థలు ఆదాయాన్ని వసూలు చేసుకునేందుకు, ఆర్థిక వనరులు పెంచుకునేందుకు వీలుగా నూతన రాజ్యాంగ సవరణ ద్వారా పంచాయితీరాజ్ చట్టాలలో మార్పు తేవాలని డిమాండ్ చేశారు.

**పంచాయితీరాజ్ రాజకీయాలు:**

భారత రాజకీయ వ్యవస్థకి కీలకమైన ప్రజాస్వామ్యం, అభివృద్ధి అన్న రెండు ఆదర్శాల రీత్యా 'అధికార వికేంద్రీకరణ' అనేది ప్రాధాన్యత నంతరించుకొంటున్నది. ఏమైనప్పటికీ మొదటినుంచి పంచాయితీరాజ్ సంస్థలను గ్రామీణ భారతదేశంలో మార్పు తెచ్చే రాజకీయ ఫలాలుగా గాని లేదా, దేశం మొత్తంలోని రాజకీయ వ్యవస్థలో భాగంగాగాని పరిగణించడం జరగలేదు. 'రాజకీయ' చీలికలు తెస్తాయి కాబట్టి పంచాయితీరాజ్ సంస్థలు 'రాజకీయరహితం'గా ఉండాలని అభిప్రాయ పడడం జరుగుతోంది.

1978లో నియమించిన అశోక్ మెహతా కమిటీ పంచాయితీరాజ్ను 'ప్రజాస్వామ్య కొనసాగింపు'గా పరిగణించింది.

రాష్ట్ర స్థాయి కంటే దిగువన, పంచాయితీరాజ్ సంస్థలను ప్రజాస్వామ్య సంస్థలుగా ఏర్పాటు చేయాలని, రాష్ట్ర ప్రభుత్వాల నుండి త,గిన అధికారాలను బదిలీ చేయడానికి రాజ్యాంగ అనుమతిని మంజూరు చేయాలని సిఫారసు చేసింది. కేంద్ర రాష్ట్ర సంబంధాలపై సర్కారియా కమిషన్ (1983) సమర్పించిన నివేదికలో కూడా, ప్రజాస్వామిక వికేంద్రీకరణకు ప్రాధాన్యతనిచ్చింది.

పంచాయితీలు ప్రజాస్వామ్య ప్రక్రియలో ఒక అంగంగా, అంతర్భాగంగా, పరిగణించాలన్న అశోకమెహతా కమిటీ సిఫారసుల మేరకు పంచాయితీ రాజ్ రెండవతరం పశ్చిమబెంగాల్‌లో ప్రారంభమయింది. కాంగ్రెసేతర, వామపక్ష, ప్రాంతీయ పార్టీల ఆధ్వర్యంలో-పంచాయితీరాజ్ వ్యవస్థ రెండవదశను సరైన రాజకీయ సంస్థలుగా, స్వయం పరిపాలనా సంస్థలుగా, రాజ్యం యొక్క సూక్ష్మ అంగాలుగా తీర్చిదిద్దే ప్రయత్నం జరిగింది. అధికార యంత్రాంగం కంటె రాజకీయ వ్యవస్థకు ప్రాధాన్యత కల్పించడం జరిగింది. స్థానిక ఎన్నికలు పార్టీల ప్రాతిపదికపైనే జరిగాయి. పార్టీలుగా పాల్గొనడానికి ఇతర పార్టీలు అభ్యంతరాలు తెలిపినప్పటికీ కూడా పశ్చిమ బెగాల్ (1978-2003), కర్ణాటక(1987), ఆంధ్రప్రదేశ్ (1986-2000)లలో స్థానిక ఎన్నికలు పార్టీల ప్రాతిపదికపైనే జరిగాయి. ఈ రాష్ట్రాలు గ్రామీణ ప్రజలను చైతన్యపరచి, వారిలో ఆత్మ విశ్వాసాన్ని కల్పించాయి. అవి బలహీనవర్గాల వారికి, మహిళలకు రిజర్వేషన్లు కల్పించాయి. రెండవతరం పంచాయితీలు, గతంలో అధికారులకు ప్రజాప్రతినిధులకు గల సమతుల్యతను భంగపరిచాయి.

కాంగ్రేసేతర, బిజెపి యేతర ప్రభుత్వాలు పరిపాలించే రాష్ట్రాలు ప్రజల ముంగిటకు పరిపాలనను తీసుకుపోవడం ద్వారా జనాన్ని రాజకీయంగా చైతన్యపరచి పంచాయితీలను పునర్జీవింపచేస్తున్నాయి. అవి స్థానిక రాజకీయ నాయకత్వాన్ని నిర్మించుకుంటున్నాయి. ఇది చివరికి దేశరాజధానిలోని లోక్ సభకు గ్రామంలోని గ్రామసభకు మధ్య సజీవ సంబంధాన్ని నిర్మిస్తోంది.

కాంగ్రెస్ పార్టీ మినహా మిగిలిన రాజకీయపార్టీలన్నీ పంచాయితీలలోని ప్రజలందరిని రాజకీయవంతం చేయడాన్ని స్వాగతిస్తున్నాయి. కాని, అట్టడుగుస్థాయి వరకు అధికారాలను బదిలీ చేయడానికి కాంగ్రెస్‌పార్టీ వైఖరి సహాయకరంగా లేదు. రాజకీయ అధికార వ్యవస్థలో 'మూడవ అంతస్థు' నిర్మాణంకోసం రాజ్యాంగ సవరణ తేవాలన్న ఆ పార్టీ నిర్ణయం స్థానిక ప్రజాస్వామ్యం పట్ల, అభివృద్ధిలో, పరిపాలనలో ప్రజలకు భాగస్వామ్యం కల్పించడం పట్ల ఆ పార్టీకి గల భయాలను పక్కన పెడితే తప్ప విజయవంతం కాబోదు.

**పంచాయతీరాజ్ విజయాలు:**

పంచాయితీరాజ్ సాధించిన విజయాలు అనేకం ఉన్నాయని అశోక్‌మెహతా కమిటి (1978) నివేదించింది. రాజకీయంగా భారత భూమిలో నాటిన ప్రజాస్వామ్య విత్తనం అది. అది సాధారణ పౌరులను గతంలో ఎప్పటికంటె అధికంగా తమ హక్కులపట్ల చైతన్యవంతం చేసింది. నిర్వాహణవరంగా అది నంవన్న ఉన్నతాధికార వర్గానికి-ప్రజలకు మధ్య అది వారధిని నిర్మించింది. సామాజిక సంస్కృతిలో అది వయసులో చిన్నవారు కావడమే కాక, ఆధునిక, సామాజిక మార్పుకు అనుకూలమైన దృక్పధం గల నూతన నాయకత్వాన్ని సృష్టించింది. అభివృద్ధికోణం రీత్యా గ్రామీణ ప్రజల్లో అభివృద్ధి మనస్థత్వాన్ని పెంపొందించడానికి తోడ్పడింది.

కేవలం రాజ్యాంగ సవరణల ద్వారానే అధికారబదలాయింపు జరుగుతుందని, లేదా ప్రతిస్పందించగల పంచాయితీలు నెలకొంటాయని ఆశించరాదు. అందుకు ఒక బలమైన రాజకీయ సంకల్పం కూడా అవసరం. సక్రమంగా ఎన్నికలు జరగడానికి, ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికయిన బలమైన స్థానిక పరిపాలనా సంస్థలు ఏర్పడడానికి, అధికార వర్గంతో పనిచేయించే అధికారాన్ని ఎన్నికయిన ప్రజాప్రతినిధులకు కట్టబెట్టడానికి, బలమైన ప్రతిపక్షాన్ని కొనసాగించడానికి ఒక బలమైన ప్రజా ఉద్యమం అవసరమవుతోంది.

అనేక ప్రాధమిక సమస్యల్ని, రాజకీయ వైముఖ్యాన్ని పక్కనపెట్టి, పది సంవత్సరాల తక్కువ కాలంలో నూతన పంచాయితీరాజ్ భారత రాజకీయ వ్యవస్థపై ముఖ్యంగా పంచాయితీరాజ్‌లపై ఎంతో ప్రభావం చూపింది. పంచాయితీ సంస్థలలో రిజర్వేషన్లు కల్పించడం వల్ల మహిళల్లో, ఎస్‌సి, ఎస్‌టి, తదితర వెనుకబడిన వర్గాలలో నూతన నాయకత్వం ఆవిర్భవించడానికి మార్గాన్ని మలచింది. జాతీయ రాజకీయ పార్టీలు, రాష్ట్ర ప్రభుత్వాలు, రాజకీయ నాయకులు-పంచాయతీరాజ్ సంస్థలను ప్రోత్సహించిన చోటల్లా ప్రజల ప్రాతినిధ్యం, భాగస్వామ్యం ఎంతో సమర్ధవంతంగా పెరిగింది.

ప్రస్తుత రాజకీయ ఉద్యమాలు చట్టపర పోరాటాలు మేధావుల ఒత్తిళ్ళు, మీడియా, అనేక ప్రభుత్వేతర సంస్థల చొరవ, ప్రపంచ శక్తుల ప్రచారం కేంద్ర ప్రభుత్వంలో ఉన్న పాలకపక్షాలను నిజమైన ప్రజాస్వామ్య అధికార వికేంద్రీకరణ పట్ల నిజమైన రాజకీయ ఆసక్తిని తప్పనిసరిగా గుర్తింపచేస్తాయి.

ఈ దిశగా, పంచాయితీరాజ్ సంస్థలు భారత ప్రభుత్వంలో మూడవ అంతస్థుగా వ్యవహరించే సాధికారతను కల్పించే దిశగా అవసరమైన రాజ్యాంగ సంస్కరణలను మరోసారి చేపట్టే చర్యలు తీసుకోవలసి ఉంది.



# ప్రజల అనారోగ్యం డాక్టర్ల మహాభాగ్యం

-వి.హనుమంతరావు

ప్రపంచంలో పుట్టిన వెంటనే చనిపోయే పిల్లల్లో నాలుగోవంతు భారతదేశంలోనే వున్నారు.

-దేశంలో పుట్టిన ప్రతీ ముగ్గురు బిడ్డల్లో ఒకరు తక్కువ బరువుతో పుడుతున్నారు. ఫలితంగా వారు బతికి బట్టకట్టడమే ప్రశ్నార్థకంగా మారింది.

-దేశంలో అయిదేండ్లలోపు పిల్లల్లో సగం మందికి తగినంత స్థాయిలో పోషకాహారం లభించటంలేదు.

-గ్రామీణ కుటుంబాల రుణభారంలో అత్యంత వేగంగా పెరిగి పోతున్న రుణం కుటుంబ సభ్యుల జబ్బు నయం చేయడానికే.

-దేశంలో 17వేల ఆసుపత్రులు, 24వేల ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 140వేల ఉపకేంద్రాలు, అయిదున్నర లక్షలపైగా ఆలోపతి వైద్యులు వున్నా ,ప్రతీ సంవత్సరం పిల్లలు అయిదేళ్లు రాకముందే 18 లక్షల మంది చనిపోతున్నారు. 130 వేలమంది స్త్రీలు ప్రసవ సంబంధమైన సమస్యలతో, ప్రసవ సమయంలో మరణిస్తున్నారు. 91-92లో ప్రతీ లక్ష ప్రసవాల సందర్భంలో 424 మంది తల్లులు మరణించగా, 97-98 నాటికి ఈ మరణాల సంఖ్య 540 కు పెరిగింది.

- పోయిందని అనుకున్న మలేరియా మళ్లారావటంతో ప్రతీ సంవత్సరం 20 వేలమంది మరణిస్తున్నారు.

-38 శాతం ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల్లో మాత్రమే అవసరమైన కీలకమైన వైద్య సిబ్బంది వున్నారు. ప్రతీ పది కేంద్రాల్లో ఎనిమిదింటిలో ప్రసవ సంబంధమైన కిట్లు లేవు; 38 శాతం కేంద్రాలలోనే ప్రసవ సేవలందించ గలుగుతున్నాయి. అబార్షన్ చేసే వైద్య సౌకర్యం కేవలం మూడు శాతం కేంద్రాల్లోనే లభ్యమవుతుంది. పిల్లల వైద్యులు, స్త్రీల వైద్యులు ప్రతీ పది కేంద్రాల్లో ఎనిమిదింటిలోనే వున్నారు.

- ఆసుపత్రుల్లో చేరిన వారిలో 40 శాతంమంది అప్పులు చేసి బిల్లులు చెల్లించాల్సిన పరిస్థితి. ప్రభుత్వాసుపత్రుల్లో చేరేవారు ఎక్కువగా పేదలే. ఈ అదనపు భారం భరించలేక ఆత్మహత్యలు చేసుకొంటున్న ఉదాహరణలెన్నో వున్నాయి.

-జనం రోగాలతో చస్తుంటే, మందుల కంపెనీలు మందహాసం చేస్తున్నాయి. 30 వేలకోట్లు పెట్టుబడితో నడుస్తున్న ఈ మందుల కంపెనీలు రెండు చేతుల్తో సొమ్ము చేసుకొంటున్నాయి. అత్యవసరమైన మందుల జాబితాను ప్రభుత్వం తగ్గిస్తూ పోతుంది. ధరల కంట్రోలు ఈ మందులకే వర్తిస్తుంది. మిగతావాటి ధరలు వారిష్టం వచ్చినట్లు నిర్ణయిస్తున్నారు. వారి లాభాల మార్జిన్లు 200 నుంచి 500 శాతం పెరిగిన ఉదాహరణలున్నాయి.

-గ్రామీణ ప్రాంతాల్లో ఆసుపత్రుల్లో పడకలు కన్నా పట్టణాల్లో పడకల సంఖ్య 15 రెట్లు ఎక్కువ. అలాగే ఈ ఆసుపత్రులపై ఖర్చు గ్రామాల్లో కన్నా పట్టణాల్లో ఏడురెట్లు ఎక్కువ.

-ప్రపంచంలో మూడోవంతు క్షయవ్యాధిగ్రస్తులు మనదేశంలోనే వున్నారు. సుమారు 20 లక్షల మందికి ప్రతీ ఏడాది ఈ వ్యాధి సోకుతుంది; వారిలో నిమిషానికొకరు చనిపోతున్నారు.

-రోగంనయం చేయడానికి కోట్ల రూపాయలు వెచ్చిస్తారు కాని అసలు రోగం రాకుండా తీసుకోవాల్సిన ఆరోగ్య సంబంధమైన చర్యలు-వీటికి అయ్యే ఖర్చు లక్షల్లోనే వుంటుంది- తీసుకొనే అలవాటు ప్రభుత్వానికి లేదు.

ఇది రాష్ట్రంలో ఆరోగ్య-కాదుకాదు- అనారోగ్య పరిస్థితి. ఆరోగ్యమే మహాభాగ్యం అని చిన్నపుడు మనమంతా చదువుకొన్నాం. కాని ఇపుడు అనారోగ్యమే మహాభాగ్యమై కూర్చుంది. ప్రజల అనారోగ్యం డాక్టర్ల మహాభాగ్యమైంది. ఈ నేపథ్యంలో ఆర్థికమంత్రి చిదంబరం బడ్జెట్లో చేసిన ప్రకటనలను విశ్లేషించుకొందాం.

అవసరమైన మానవ, ఆర్థిక వనరులను సమకూరుస్తానని, ప్రస్తుతం అమల్లోవున్న సార్వత్రిక ఆరోగ్య ఇన్సూరెన్స్ పథకం పేదలకు అనుకూలంగా మారుస్తానని, కొత్తగా గ్రూపు ఆరోగ్య పథకాన్ని ప్రవేశపెడతానని, ఎయిడ్స్ వ్యాధిని కంట్రోలు చేస్తానని చేసిన ప్రకటనలు వినడానికి బాగానే వున్నాయి. గత సంవత్సరం బడ్జెట్‌లో కూడా పేదలు రోజుకు రూపాయ చొప్పున ఇన్సూరెన్స్ ప్రీమియం చెల్లిస్తే, వాళ్ల ఆరోగ్యం సంగతి ప్రభుత్వం చూస్తుందని ఆకర్షణీయమైన ప్రకటనలు చేశారు. అది సుమారుగా కాగితం మీదే వుండిపోయింది. అందుబాటులో వున్న సమాచారం ప్రకారం ఈ పథకంలో 11 లక్షల మంది (104 కోట్ల జనాభాలో) చేరారని, అందులో పేదరికపు రేఖ కింద వున్నవారు కేవలం 11408 మంది మాత్రమేనని ప్రస్తుత ఆర్థిక మంత్రి చెప్పారు; అంటే పేదరికపు రేఖ కింద వున్నవారి సంఖ్య 26 కోట్లలో 11408 మందికే. ఈ పథకం కింద ఎన్ని షరతులు పెట్టారో చూడండి. ఔట్ పేషంట్లు ఈ పథకం కిందకు రారు, ఆసుపత్రిలో చేరితేనే, అదికూడా 15 పడకలున్న ఆసుపత్రిలో చేరితేనే (అయిదు లక్షల కన్నా తక్కువ జనాభాగల చిన్న పట్టణాలైతే 10 పడకలు). ఆ ఆసుపత్రిలో డాక్టరు, నర్సులు, అన్ని ఇతర సరంజామాలు వుంటేనే

ఈ పథకంకింద లబ్ధి పొందవచ్చు. పేదవాడు ఆసుపత్రికి వెళ్లేది రోగం నయం చేసుకోవడానికి. కాని ఈ ఇన్సూరెన్స్ పథకం డబ్బులు చెల్లింపుల గురించి మాట్లాడుతుందే కాని వాడి రోగం గురించి మాట్లాడదు. ప్రభుత్వం పెట్టిన షరతుల మేరకు సౌకర్యాలు గల ఆసుపత్రులు దేశంలో ఎన్ని వున్నాయి? ప్రభుత్వ లెక్కల ప్రకారమే దేశంలో మూడోవంతు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో మాత్రమే 60 శాతం మేరకు కీలకమైన రోగ నివారణ సౌకర్యాలున్నాయి. అయిదు శాతం కేంద్రాల్లో డాక్టర్లు లేరు; 32 శాతం కేంద్రాల్లో పరీక్ష చేసే టెక్నీషియన్లు లేరు; 5.4 శాతం కేంద్రాల్లో ఫార్మసిస్టులు లేరు. మందులు లేకపోవటంవల్ల రోగులు తమ రోగాల్ని నయం చేసుకోవడానికి 60 శాతం ఖర్చు మందుల కొనుగోలుకు, కన్సల్టెన్సీలకు ఖర్చు చేస్తున్నారు. దేశంలోని మొత్తం డాక్టర్లలో 94 శాతం మంది పట్టణాల్లోనే వున్నారు. ఆసుపత్రులో 68.5 శాతం పట్టణాల్లోనే వున్నాయి. పట్టణాల్లో ప్రతీ రెండువేల మందికి ఒక డాక్టరు వుంటే, గ్రామాల్లో ప్రతీ 20 వేల మందికి ఒక డాక్టర్! డాక్టరు వుండడు; వుంటే నర్సు వుండదు; ఇద్దరూ వుంటే మందులుండవు; ఎక్విప్‌మెంటు వుంటే అవి పని చేయడానికి కరెంటు వుండదు. ఒక వేళ అన్ని వుండి, పేదవాడు హాస్పిటల్‌లో చేరితే, ఈ పథకం కింద లబ్ధి పొందాలంటే ఎన్ని పుర్రాకులు పడాలి? ఈ పథకం పేదవారు కాని వారికే ఉపయోగపడుతుందని, పేదవారు ఈ ఇన్సూరెన్స్ ప్రీమియం చెల్లించలేక పోతున్నారని, అందుచేత ఈ పథకాన్ని మార్పు చేయ సంకల్పించానని చిదంబరమే అంగీకరించారు. ఈయన తయారు చేసిన కొత్త పథకం క్రింద అయిదుగురు గల కుటుంబం సంవత్సరానికి రు. 165లు, ఏడుగురుంటే రు. 330లు చెల్లించాలని; ప్రభుత్వం ఒక వ్యక్తికి ఇచ్చే సబ్సిడీ ఇవుడున్న నూరు రూపాయలనుంచి రు. 200లకు, అయిదుగురున్న కుటుంబానికి రు. 300లు, ఏడుగురుంటే రు. 400 చెల్లిస్తుంది. ఇందువల్ల ప్రభుత్వానికయ్యే ఖర్చు రు. 40 కోట్లు మాత్రమే. గత ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకంలో చేరిన 11 లక్షల మంది ఈ పథకంలో కొనసాగుతున్నారని అనుకొంటే, వారిమీద ప్రభుత్వం సబ్సిడీ రూపంలో పెట్టే తలసరి ఖర్చు కేవలం రు. 363లు. ఈ మొత్తంతో ఆరోగ్యం ఎంత బాగుపడుతుందో వేరే చెప్పాలా?

ఈ పథకం కాకుండా ప్రస్తుత ఆర్థికమంత్రి గ్రూప్ ఇన్సూరెన్స్ అనే కొత్త పథకాన్ని ప్రవేశపెడుతున్నానని చెప్పారు. స్వయం సహాయ గ్రూపుల్లో సభ్యులు, రుణ సౌకర్యం కల్పించగా పనిచేసే ఇతర గ్రూపుల్లో సభ్యులకు మాత్రమే ఈ పథకం వర్తిస్తుంది. ఈ పథకంలో చేరేవారు ప్రతీ ఒక్కరు నూరు రూపాయలు చెల్లించాలి; అయితే ఇన్సూరెన్స్ కవర్ పదివేల రూపాయలకు వర్తిస్తుంది. ప్రభుత్వరంగలో జీవితేతర బీమా సంస్థల ద్వారా (నాన్-లైఫ్) అమలు జరుగుతుంది.

ఈ ఆరోగ్య ఇన్సూరెన్స్ పథకం ప్రయివేట్ ఇన్సూరెన్స్ కంపెనీలు తమ వ్యాపారాన్ని పెంచుకోవడానికి వుపయోగపడుతుంది. కొన్ని విదేశీ కంపెనీలు దేశంలో ఇపుడిపుడే పనిచేయటం ప్రారంభించాయి. ఇలాంటి పథకాలను ఈ కంపెనీలు ఎగరేసుకపోయి సొమ్ము చేసుకొంటాయి. దేశంలో కార్పోరేట్ వైద్యశాలలు ఇప్పటికే ఇఎస్ఐ పథకాన్ని దుర్వినియోగం చేసి నిధులను తమవైపు మళ్లించు కొంటున్నారో తెలిసిన విషయమే. గ్రామీణ ప్రాంతాల్లో వైద్య సౌకర్యాల కొరత తీర్చేందుకుగాను ప్రయివేటురంగాన్ని ప్రోత్సహించే దిశగా పన్నుల చెల్లింపుల్లో రాయితీలు ప్రకటించింది. 100 పడకల ఆసుపత్రి ఏర్పాటు చేస్తే అయిదు సంవత్సరాలపాటు వచ్చిన లాభాల మీద పన్ను చెల్లించనక్కర్లేదు. ఈ పథకానికి ఎటువంటి స్పందన లభించింది? 2002లో 139 ప్రయివేటు ఆసుపత్రుల లాభాలను (పన్ను చెల్లించక ముందు) అధ్యయనం చేయగా, అందులో సగం ఆసుపత్రులు లాభాలు చేసుకొంటున్నట్లు, కాని నయాపైసా పన్ను చెల్లించటం లేదని, 40 శాతం లాభాలు చేసుకోవటం లేదని 16 ఆసుపత్రులు లక్ష కన్నా తక్కువగా, 22 శాతం 1-10 లక్షల మధ్య పన్నులు చెల్లించాయని, 12 శాతం మాత్రమే 10 లక్షల పైన పన్ను చెల్లించాయని వెల్లడైంది. దీనిని బట్టి తేలేదేమంటే సగం ఆసుపత్రులు ఎలాగూ పన్నులు చెల్లించటం లేదు. కాబట్టి ప్రభుత్వ పథకానికి అర్థం లేదు. కాని పథకం ప్రవేశపెట్టడం వల్ల అడ్డదారులు తొక్కి, ఆదాయం సంపాదించే రోగం పట్టుకొంటుంది. ఈ ఆసుపత్రులకు కొన్ని పరికరాలను దిగుమతి చేసుకొంటే వాటి మీద ఎక్సయిజు, కస్టమ్స్ సుంకాలనుంచి మినహాయింపు ఇవ్వటం ఆహ్వానించదగిందే. కాని అలాంటి మినహాయింపులు రోగులకు ఎటువంటి రిలీఫ్ ఇవ్వకపోగా, వారి బిల్లులు చుక్కలు చూస్తున్నాయి.

గ్రామీణ ప్రాంతాల్లో వైద్య సౌకర్యాలు అధమ స్థాయిలోనే వున్నాయని ప్రభుత్వం ఆర్థిక సర్వే అంగీకరిస్తుంది. పోనీ బడ్జెట్ ఏమైనా పెంచారా అంటే 02-03లో ఆరోగ్య పద్దుకింద రు. 1500 కేటాయించగా 03-04 లో కూడా అంతే కేటాయింపు. 04-05లో కాస్త పెరిగినా, అది ద్రవ్యోల్బణం మింగేస్తుంది.

పేదవాడికి కంటితుడుపు పథకాలు, ప్రయివేటు రంగానికి పెద్దపీట- ఇదీ చిదంబరం బడ్జెట్ సారాంశం.



# పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి చీకటి రోజులు

పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థకు ముంచుకొస్తున్న ప్రమాదం కమ్యూనిస్టుల నుంచి కాదు; నక్సలైట్ల నుంచి అసలే కాదు; బిజెపి నుంచేనని గత బడ్జెట్ సమావేశం కార్యక్రమం, కార్యకలాపాలను గమనించిన వారెవరైనా అంగీకరించే విషయం. ప్రజల అధికారాన్ని ఈ వ్యవస్థ ద్వారానే సాధిస్తాం అని ఉభయ కమ్యూనిస్టు పార్టీలు తమ తమ పార్టీల నియమనిబంధనావళిని మార్చుకోగా, మొదటినుంచీ ఈ వ్యవస్థలో విశ్వాసమున్న పార్టీలు ఆచరణలో దానికి దూరమవుతున్నాయి. కాంగ్రెస్‌పార్టీయే అవిచ్ఛిన్నంగా, అంతరాయం లేకుండా పరిపాలించినంత కాలం ఆదర్శవంతంగా ఈ వ్యవస్థను నడిపించారని చెప్పలేం కాని, ఇటీవలి కాలంలో పార్లమెంటులో, శాసనసభల్లో విస్తుపోతూ చూస్తున్న దుస్సంఘటనలు, దుస్సాంప్రదాయాలను ఎన్నడూ చూడలేదు. కేంద్రంలో పి.వి. నరసింహారావు ప్రభుత్వం అధికారం నుంచి తొలగిన తర్వాత కాంగ్రెస్ ప్రతిపక్షపాత్ర పోషించటం ప్రారంభించిన తర్వాత పార్లమెంటులో ఆందోళనకరమైన పరిణామాలు జరుగుతూ వచ్చినా, ఇటీవలి బడ్జెట్ సమావేశంలో బిజెపి ప్రవర్తించిన తీరు ఆ ఆందోళన కరమైన పరిణామాలను పరాకాష్ట స్థాయికి తీసుకొనిపోయింది. అయిదు లక్షలకోట్ల రూపాయల బడ్జెట్‌ను చర్చించకుండానే ఆమోదించటం పార్లమెంటు చరిత్రలో ఒక మాయని మచ్చగా మిగిలిపోతుంది. దేశాన్ని శాసించే చట్టాలను రూపొందించాల్సిన ప్రతినిధులు ఇటువంటి ప్రజాస్వామ్య వ్యతిరేక పద్ధతుల నవలంబిస్తుంటే సిగ్గుతో తల వంచుకోవాల్సి వస్తుంది. బిజెపి ఇటువంటి వైఖరి అవలంబించడానికి వారి కారణాలు వారికి వుండవచ్చు; ఆ కారణాలు సహేతుకమైనవి కావని కొందరు భావించవచ్చు. కాని, పార్లమెంటులో అటువంటి పరిస్థితులేర్పడి, ప్రభుత్వ విధానంతో ఎట్టి పరిస్థితుల్లోనైనా అంగీకరించలేని పరిస్థితి ఏర్పడినపుడు కూడా ప్రతిపక్షం తమ అభ్యంతరాన్ని వ్యతిరేకతను ఎలా తెలియవచ్చునో పార్లమెంటు నియమ నిబంధనలు అనేక మార్గాలు సూచిస్తున్నాయి. వాటికి కట్టుబడి వుంటామని ప్రమాణాలు చేశాయి. అలా చేసిన తర్వాత కూడా వాటిని ఇంత తీవ్రంగా ఉల్లంఘించటం పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో మాకు విశ్వాసం లేదని చెప్పడమే అవుతుంది. నక్సలైట్లు అదే అంటున్నారు. బిజెపి వారితో అంగీకరిస్తుందా? కార్మికులు తమ కోర్కెలకోసం సమ్మెలు చేసినపుడు, రాజకీయ పార్టీలు ఆందోళనలకు పూనుకొన్నపుడు హింసాయుత ఘటనలు చోటు చేసుకోవటం మనం చూస్తున్నాం; అవి చట్ట వ్యతిరేకం అని ప్రభుత్వం అంటుంది. పార్లమెంటులో తమ చట్ట వ్యతిరేక ప్రవర్తన ద్వారా వారికి ఎటువంటి సంకేతాన్ని, సందేశాన్ని పంపిస్తుంది? చట్ట సభలో ప్రవర్తనకు కూడా కొన్ని హద్దులుంటాయి.

ఇటీవల మన శాసనసభలో కూడా సభాకార్యకలాపాలను స్థంభింపచేసిన పరిణామాలు చోటు చేసుకొన్నాయి. ముక్కున వేలేసుకొన్నారు. బడ్జెట్‌పై జరిగిన చర్చలు నామమాత్రం. ఇదివరకటి లాగే అనేక బడ్జెట్ డిమాండ్లు గిలెటిన్ చేయాల్సి వచ్చింది. ఆమోదించిన బిల్లుల మీద కూడా లోతుగా చర్చ జరగలేదు. ఇతర ప్రతిపక్షాల హక్కులను కూడా ప్రధాన ప్రతి పక్షం కాలరాచింది.

ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారు? నేరచరితులు చట్ట సభల్లో ప్రవేశించటం, నైతికతకు నీళ్లొదలటం, నియమ నిబంధనల పరిమితుల్లో ప్రవర్తించ నిరాకరించటం, ఎన్నికల్లో పరాజయాన్ని, ప్రజల తీర్పును జీర్ణించుకోలేక, అక్కసుతో ప్రవర్తించటం, తాము వేలకోట్లు ఖర్చు చేసి తమవిజయాల గురించి చేసిన ప్రచారం ఎందుకూ కొరకాకుండా పోవటం- ఇలా ఎన్నో కారణాలున్నాయి. పార్లమెంటులో ఇలా ప్రవర్తించి వుండాల్సింది కాదని బిజెపి నాయకుడు అద్వానీ ఇపుడు ప్రకటించడం చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నట్లుంది. తెలుగుదేశం కూడా తన ప్రవర్తనను పునః సమీక్షించుకొంటుందని ఆశించాలి.



## 'వీక్షణం' పాఠకులకు

1. ఇటీవల ఎన్నికల ప్రత్యేక సంచికతో ప్రారంభించి ప్రతీ సంచికలో ఒక విషయాన్ని తీసుకొని, దానిమీద ఫోకస్ చేస్తూ పలువ్యాసాలు ప్రకటిస్తున్న విషయాన్ని మీరు గమనించే వుంటారు. ఇలా చేయటం వల్ల పత్రికను చదవటంతోపాటు జాగ్రత్త చేసుకొనే విలువ (PRESERVATION VALUE) వుంటుందనే ఆలోచనతో ఈ పద్ధతిని చేపట్టాం. ఈ మార్పు మీకు ఆమోదయోగ్యమేనా? మీ అమూల్యమైన అభిప్రాయాన్ని తెలియచేయండి.

2. గత సెప్టెంబరులో చేరిన చందాదారుల చందా ఈ ఆగష్టుతో ముగిసింది. రు. 140/-లు పంపి మీ చందాను కొనసాగించు కోవాలని విజ్ఞప్తి.

ఎడిటర్

# భారతీయులు స్వభావ సిద్ధంగానే అవినీతిపరులు కారు

- ఎన్. విఠల్

మాజీ చీఫ్ విజిలెన్స్ కమీషనర్ ఎన్.విఠల్ మినూ మసాని ద్వితీయ స్మారకోపన్యాసం ఇచ్చిన సందర్భంగా సభికులు అడిగిన ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు:

ప్ర: సుఖ్‌రామ్‌కి ఏం జరిగింది?

జ: ఆయనకు ఒక కేసులో శిక్షపడింది. రామారావు కంపెనీకి సంబంధించిన ఒక సిబిఐ కేసులో నేను ప్రాసిక్యూషన్ సాక్షిగా ఉన్నాను. ఆయనకు మూడేళ్ళ శిక్ష పడింది. ఆయన అప్పీల్ చేసుకొన్నారు గాని అది ఇంకా పెండింగ్‌లోనే ఉంది.

ప్ర: ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్-భారత దేశానికి, అవినీతి స్థాయిలో, 83వ స్థానాన్ని ప్రకటించింది. మనలో అవినీతికి కారణం మన 'డిఎన్ఎ' యేనా, లేక బహుళజాతి సంస్థలు వాటి ప్రయోజనాలకోసం మనల్ని అవినీతి పరులుగా మారుస్తున్నాయా?

జ: ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్ (టి.ఐ) అంచనాతో ఏకీభవిస్తున్నాను. ఎందుకంటే, ప్రపంచబ్యాంక్‌తోసహా ఎవరైనాగాని అవినీతికి సంబంధించి ఒక అవగాహనకు రావడానికి నేడు అదొక్కటే ప్రమాణం. అందువల్ల మనం దాన్ని ఆమోదించాల్సిందే. బంగ్లాదేశ్ మాత్రం దానిని తిరస్కరించింది. ఎందుకంటే ఆ జాబితాలో ఆఖరున ఉన్న దేశం అదే. గునియాకు ఆఖరిర్యాంకు ప్రకటించిన సంవత్సరం నేను అక్కడే, కామన్‌వెల్త్ దేశాల సమావేశంలో ఉన్నాను. గునియా కూడా టిఐ ర్యాంకుల్ని ఆమోదించ లేదు. దాన్ని అంగీకరించకపోవడంవల్ల మనకి వచ్చేదేం లేదు, మీ ప్రోగ్రెస్ రిపోర్టు-మీరు లెక్కల్లో తప్పారని చెబుతూ ఉంటే, ఆ ప్రోగ్రెస్ రిపోర్టును అంగీకరించనంత మాత్రాన మీకు కలిసొచ్చేదేమీ ఉండదు.

మన డిఎన్ఎ వల్లనే మనం అవినీతికరంగా తయారవుతున్నామా? 'భారతీయులు స్వభావ సిద్ధంగానే అవినీతిపరులా? అన్న విషయమై నేను గతంలో ఒక ఉపన్యాసం ఇచ్చాను. మనం స్వభావసిద్ధంగానే అవినీతిపరులమని నేను అనుకోవడం లేదు. అవినీతిస్థాయి మూడు అంశాలపై ఆధారపడి ఉంటుంది. ఒకటి: ఒక వ్యక్తికి విలువల పట్ల గల గౌరవం, మన మతం ఏం బోధిస్తోంది, మన తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఏం బోధిస్తున్నారు, మన సాటివాళ్ళు ఏం బోధిస్తున్నారు-అనేది. రెండవది: సామాజిక విలువలు. ఇవాళ మనం ఆమోదిస్తున్న విలువలు ఏమిటి? నేడు మనం అవినీతిగురించి ఎంతో వింటున్నాం. కాని ఎవ్వరూ దాని గురించి పట్టించుకోవడం లేదు. ఎవర్నీ శిక్షించడం లేదు. మూడవది: సామాజిక వ్యవస్థ. మనం సామాజికంగా అవినీతిని సహించడానికి ఎంతో అలవాటు పడిపోయాం.

ఒకదేశం అవినీతిమయం అయిందా కాదా అనేది నిర్ణయించే అంశాలలో వ్యవస్థ కూడా ఒకటి. ఉదాహరణకి ఒక ప్రశ్న. మీరు ఒంటరిగా వెడుతుంటారు. చుట్టుపక్కల ఎవరూ లేరు. రోడ్డుమీద పదివేల రూపాయల నోట్లకట్ట ఒకటి పడిపోయింది. దాన్ని మీరు తీసుకుంటారా? ఈ ప్రశ్నకి 'తీసుకుంటాం' అని 90 శాతమంది సమాధానం చెప్పారు. అయితే మళ్ళీ అదే ప్రశ్న: "మీరు ఒంటరిగా వెడుతుంటారు. చుట్టుపక్కల ఎవరూ లేరు. రోడ్డుమీద పదివేల రూపాయల నోట్లకట్ట ఒకటి పడి ఉంటుంది. అయితే- అక్కడ రహస్యంగా ఒక కెమేరా అమర్చి ఉంటే ప్రమాదం 10 శాతం, అలాగే అది పనిచేస్తూ ఉంటే ప్రమాదం మరో 10 శాతం ఉంది. ఆ నోట్ల కట్టని తీసుకుంటారా"? ఇప్పుడు 90 శాతమంది 'తీసుకోం' అనే చెప్పారు. సమాధానాల్లో వచ్చిన ఈ తేడాకి కారణం 'వ్యవస్థ'.

నేను సివిసిగా ఉన్నపుడు అన్ని అంతర్జాతీయ విమానాల్లో క్లోజ్‌డ్ సర్క్యూట్ టివిలు ఏర్పాటు చెయ్యాలని పట్టుబట్టాను. కస్టమ్స్‌వారు, పోలీసులు వ్యతిరేకించారు. కెమేరాలు పెట్టాక కెమేరా లెన్స్ మీద చూయింగ్‌గమ్ అంటబెట్టడమో, లేక దానిమీద టోపీలు బోర్లించడమో చేశారు. అయితే క్లోజ్‌డ్ సర్క్యూట్ టివిలు మాత్రం ఇంకా కొనసాగుతూనే ఉన్నాయని అనుకొంటున్నాను. కనుక 'వ్యవస్థ' అనేది మూడవ అంశం.

అవినీతిని ప్రోత్సహించే వ్యవస్థల్నే మనం సృష్టించాం. ఉదాహరణకి మన బ్యాంకింగ్ విధానాన్ని చూడండి. మీరు ఒక బ్యాంక్ నుంచి ఒక లక్ష రూపాయలు అప్పు తెచ్చుకున్నారనుకోండి, ఆ బ్యాంక్‌ను చూసి మీరు భయపడతారు. అదే పదికోట్ల రూపాయలు అప్పు తెచ్చుకున్నారనుకోండి, అప్పుడు ఆ బ్యాంకే, మిమ్మల్ని చూసి భయపడుతుంది. అవినీతిపరుల పేర్లను నేను వెబ్‌సైట్‌లో పెట్టాను. అలాగే, 'బ్యాంకుల్ని మోసం చేసినవారి పేర్లను మీరు కూడా ఎందుకు పెట్టరు' అని అప్పటి రిజర్వ్‌బ్యాంక్ గవర్నర్ డాక్టర్ జాన్-ని అడిగాను. అప్పుడు ఆయన-రిజర్వ్‌బ్యాంక్ మాన్యువల్‌లోని బ్యాంకింగ్ రహస్యాల చట్టం, ఆర్టికల్ 14 లోని మూడవ పేరా ప్రకారం-అది సాధ్యంకాదని జస్టిస్ చంద్రచూడ్ ఇచ్చిన సలహాగురించి వివరించారు.

అయినా సరే...మనం వారిపేర్లు ప్రకటించాలి.

మనదేశంలోని పరిశ్రమాధిపతులు బాగానే ఉన్నా పరిశ్రమలు మాత్రం ఎందుకు మూలనపడుతున్నాయా అని ఆశ్చర్యపోతూంటాం. వాళ్ళు సిబిఐ దాడులు జరిగినప్పుడు మాత్రమే అనారోగ్యం పాలవుతారు. అలాంటపుడే వారు- అపోలో హాస్పిటల్‌కి వెళ్ళి 'నాకు హర్ట్ ఎటాక్ వచ్చింది. ముందస్తు బెయిల్ ఇప్పించండి' అని అడుగుతారు. అంటే మనం అవినీతిపరులమయినట్టు కాదా? మనందరం మనుషులమే. మనషులందరిలాగే మనం మంచివాళ్ళమూ అలాగే చెడ్డవాళ్ళమూ కూడా. భారతీయులకు మంచి సిఫారసే కావాలనుకుంటే ఈ ఉదాహరణ చూడండి. వివిధ దేశాలలో ఒక ప్రయోగం చేసేవారు. పదివేల రూపాయలు లేదా అంత మొత్తానికి సరిపోయే ఆయాదేశాల కరెన్సీని బహిరంగ ప్రదేశాలలో ఉంచి ఆ డబ్బు ఎవరికి చేర్చాలో తెలిపే ఒక చీటీ కూడా పెట్టేవారు. ఇలాంటి ప్రయోగాన్ని అనేకదేశాలలో చేసినపుడు, భారతదేశంలో 85 శాతం మంది ప్రజలు ఆ మొత్తాన్ని వాపసుచేశారనే విషయాన్ని నాకు చెప్పారు. దీన్ని బట్టి భారతీయులు మౌలికంగా నిజాయితీ పరులేననీ, కాని ప్రజల్ని అవినీతిపరులుగా చేసే వ్యవస్థనే మనం నెలకొల్పుకున్నామని తెలుస్తోంది. కాబట్టి, భారతీయులు డిఎన్ఎ కారణంగానే అవినీతి పరులవుతున్నారా, లేక ఎంఎన్‌సీలే వారిని అవినీతిపరులుగా చేస్తున్నాయా? ఎంఎన్‌సీలు వచ్చి మనలను అవినీతిమయం చేయాలని కోరుకోం. మనకి ఇప్పటికే కొన్ని దేశవాళి పద్ధతులు ఉన్నాయి.

ప్ర: మీరు ఎప్పుడైనా ఈల ఊదారా?

జ: ఊదాను, అవినీతిని బహిర్గతపరచే విషయంలో! ఒక అధికారిగా నేనే స్వయంగా అనేక కేసులు పరిశోధించాను. ఎక్కడో ఏదో జరిగిపోతోందని ఎవరినో హెచ్చరించిన సంఘటనలు తక్కువే. ఎందుకంటే, వీటిగురించి నేనే తగు చర్య తీసుకునే స్థానంలో ఉన్నాను. అందువల్ల నేను ఈల ఊది మరొకరిని హెచ్చరించాల్సిన అవసరం లేదు. అవసరమైనపుడు నేనే చర్య తీసుకోగలను.

ప్ర: ప్రస్తుత సివిసి శంకర్ కంటె మీవైఖరి ఏవిధంగా భిన్నంగా ఉంటుంది? ఒక అధికారుల సంఘ సమావేశంలో ఆయన మాట్లాడుతూ, తాను ప్రజలందరూ మంచివారనే భావిస్తానని, కాని తన పూర్వాధికారికి, వారి పరిసర వాతావరణంతో సంబంధం లేదని అన్నారు, దీనిపై మీ వ్యాఖ్యానం..?

జ: ఇది చాలా చమత్కారమైన ప్రశ్న. నిజానికి శంకర్ అద్భుతమైన అధికారి. నాకుఉన్న విలువలన్నీ ఆయనకీ ఉన్నాయి. ఆయన అద్భుతంగా పనిచేస్తున్నారు. ఆయనకూ నాకూ తేడా ఏమిటంటే, నాది పెద్ద నోరు. ప్రతిదీ బాహాటంగా చెప్పేస్తూ ఉంటాను. అందుకు నన్ను నిందించవచ్చు కూడా! నిజానికి నాభార్య పెద్ద విమర్శకురాలు. ఆవిడ "శంకర్ ని చూడండి, తనపని ఎంతో గుంభనంగా, సమర్ధ వంతంగా చేసుకుపోతున్నారు. మీరు అన్నీ బయటికి మాట్లాడడం వల్ల భవిష్యత్ అవకాశాలను పాడు చేసుకుంటున్నారు"-అంటుంది.

ప్ర: జయలలిత అవినీతి కేసుల్ని తమిళనాడునుంచి కర్ణాటకకు సుప్రీంకోర్టు బదిలీ చేయడంపై మీ అభిప్రాయం ఏమిటి?

జ: అది మంచి నిర్ణయమని అనుకుంటున్నాను. అన్ని విషయాలు పరిగణలోకి తీసుకునే సుప్రీంకోర్టు ఆ నిర్ణయం చేసింది. ఈ నిర్ణయాన్ని చాలామంది ప్రజలు స్వాగతించారనే అనుకుంటున్నాను.

ప్ర: అధికారుల్లో, రాజకీయాల్లో అవినీతి గురించి ఎంతో చర్చజరుగుతోంది. మన న్యాయవ్యవస్థలో నెలకొన్న అవినీతి గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఈ రంగం భవిష్యత్తు ఏమిటి?

జ: ముండకోపనిషత్‌లోని సూక్తి ' సత్యమేవజయతే' అనేది మన ప్రభుత్వ ఆదర్శం. కాని దురదృష్టవశాత్తు న్యాయవ్యవస్థకి వ్యతిరేకంగా ఉన్న సత్యానికి, 1987 కోర్టుధిక్కార చట్టం కారణంగా-ఎలాంటి రక్షణ లేకుండా పోయింది. కాబట్టి న్యాయవ్యవస్థ గురించి మీరు వాస్తవాలు బయటపెట్టడం కుదరదు. మీరు ఏదయినా చెబితే, జైలుకి వెడతారు. భారత మాజీ ప్రధాన న్యాయమూర్తి ఒకరు న్యాయ వ్యవస్థలో అవినీతి స్థాయి 20 శాతం అని చెప్పారు. కాని, సివిసి చట్టం కారణంగా మనం న్యాయవ్యవస్థకు- దాని గౌరవాన్ని దానికి ఇవ్వాల్సిందే. ఈ చట్టం ఎన్నికల సంస్కరణలకు సంబంధించేదే అయినా, మొత్తమంతా అదే కాదు. భగవంతుడి గురించి చెప్పినదేమంటే- దేవుడి ముందు న్యాయం పొందడంలో జాప్యం జరగవచ్చు. కాని, న్యాయం తప్పక జరుగుతుంది-అని. కాని భారతదేశంలో న్యాయవ్యవస్థ బహుశ దేవుడికంటే గొప్పది అనుకుంటాను. ఎందుకంటే ఇక్కడ జరిగే జాప్యం-దేవుడివద్ద జరిగే జాప్యం కంటే ఎక్కువ! రాజు తక్షణం శిక్షిస్తాడు. కాని భగవంతుడు సమయం ఆసన్నమయ్యేవరకూ వేచి చూస్తాడు! మన న్యాయవ్యవస్థ ఈ దేశానికి చాలామంచి చేసింది. అందుకు మనం దానిని అభినందించాలి.

ప్ర: వేగంగా వృద్ధి చెందుతున్న నేపథ్యంలో చైనా అవినీతిని ఏవిధంగా ఎదుర్కొంది? ప్రజాజీవనంలో నిజాయితీని బహిరంగంగా సత్కరించే ఆలోచన మంచిదేనా?

జ: చైనా అవినీతిని ఎలా ఎదుర్కొంది? చైనాలో మనకు ఉన్నట్టుగా విస్తృత న్యాయవ్యవస్థ లేదు. నేను ఇప్పుడే మన న్యాయవ్యవస్థను





### నిరంతరం శ్రమించే రైతన్నల కోసం

# రుణం చెల్లింపులో సౌలభ్యం బ్యాంకుల ద్వారా పరపతి సౌకర్యం

రుణభారంతో విలవిలలాడుతున్న రైతాంగాన్ని ఆదుకొనేందుకు రాష్ట్ర ప్రభుత్వం ముందుకు వచ్చింది. నానాటికి పెరుగుతున్న వడ్డీ రైతన్నకు భారంగా మారింది. అసలు కన్నా వడ్డీ ఎక్కువై అమాయక రైతులను కబళిస్తోంది. అందుకే రుణం చెల్లింపులో సౌలభ్యం కలిగిస్తూ ప్రాణత్యాగం చేసుకొనే దారుణం నుండి రైతును కాపాడేందుకు ప్రభుత్వం ఈ ప్యాకేజీని అమలు చేస్తోంది.

## ప్యాకేజీలో ఉన్న ప్రత్యేకతలు

- వర్షాలు పడక, పంటలు పండక, అల్లాడుతున్న రైతాంగాన్ని ఆదుకోవాలని, అలాగే అన్ని ప్రాంతాల రైతులకు విరివిగా అప్పులివ్వాలని భారతీయ రిజర్వుబ్యాంకు, కేంద్ర మరియు రాష్ట్ర ప్రభుత్వాల ఆదేశానుసారం రాష్ట్రస్థాయి బ్యాంకర్ల సమితి నిర్ణయించింది.
- గడిచిన 5సం॥ కాలంలో వరుసగా రెండు సంవత్సరములు రాష్ట్ర ప్రభుత్వం కరువు మండలాలుగా ప్రకటించి వుంటే, ఆ ప్రాంత రైతుల రుణాలను వాయిదా వేస్తారు. ఈ మండలాల్లో మార్చి 2004 నాటికి పంట ఋణాల్లో బాకీ (అసలు+వడ్డీ) మరియు ఇతర వ్యవసాయ కాలపరిమితి రుణాలు కలిపిన మొత్తాన్ని 5సంవత్సరాలలో చెల్లించే విధంగా వాయిదా వేస్తారు. ఈ 5సంవత్సరాల కాలంలో మొదటి రెండు సంవత్సరములు రైతు ఏమీ చెల్లించకుండా మొత్తం చివరి 3సంవత్సరాలలో చెల్లించే విధంగా వాయిదాల తీర్మానం, వాయిదా వేసిన మొత్తానికి ప్రస్తుతం అమలులో వున్న వడ్డీ విధిస్తారు. వాయిదా వేసిన రైతులందరికీ మళ్ళీ పంట రుణాలు మంజూరు.
- ఇంతవరకు రుణము పొందని రైతులు తమతమ పట్టాదారు పాసు పుస్తకాలు, భూమి రికార్డులు, పత్రములతో సంబంధిత బ్యాంకు మేనేజరుని కలిసి అప్పుకోసం దరఖాస్తు చేసుకోవచ్చు.
- రాష్ట్రంలో మొట్టమొదటి సారిగా రుణాలు చెల్లించలేక ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలకు, ఒన్‌టైమ్ సెటిల్‌మెంట్ క్రింద రూ.50,000/-ల మొత్తం వరకూ వడ్డీ/అసలు మాఫీ.

- ఇది రాష్ట్రప్రభుత్వం రైతులకు అందిస్తున్న సహాయం. విలువైన జీవితాలను ఉరితాళ్ళకు బలిచేసుకోవద్దు.
- మీ ఆత్మహత్యలతో మీ భార్యాబిడ్డల రుణానుబంధాలు తీరుతాయనుకోవద్దు.
- ఈ అవకాశాన్ని అందుకోండి, కొత్త రుణాలను పొందండి.

ఈ ప్రభుత్వం.. ప్రజల ప్రభుత్వం.. రైతుల ప్రభుత్వం !

**కృష్ణ పుష్కరాలు - ఆగష్టు 28 నుండి సెప్టెంబర్ 8,2004 వరకు**

జారీచేసినవారు : సమాచార పౌరసంబంధాల శాఖ

RNI Regn. No. APTEL/2003/11482

**PRINTED BOOK**

*Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06*



పొగిడాను. కాని దానికి ఒక బలహీనత కూడా ఉంది. ఎందుకంటే ఇక్కడ ఎంతో కాలయాపన జరుగుతుంది. ఈ సమస్యని చైనా మనకంటే కొంచెం మెరుగ్గా పరిష్కరించింది. ఈ విషయంలో మనం 72వ స్థానంలో ఉండగా, చైనా 58వ స్థానంలో ఉంది. అంటే, చైనాలో అవినీతి మన దేశంలో కంటె తక్కువ. నిజానికి చైనా ఉపాధ్యక్షులలో కొందరిని అవినీతి కారణంగా కాల్చి చంపారు. నిన్న కొందరు నన్ను అడిగారు-అవినీతి పరుల్ని మనం కాల్చి చంపకూడదా-అని. దురదృష్టవశాత్తు మన దేశంలో ఆ పద్ధతి లేదు. చైనాలో అవినీతిని మనకంటె సమర్ధవంతంగా ఎదుర్కొనడానికి కారణం, అక్కడ మనకున్నటువంటి పరిమితులు లేకపోవడమే.

ప్రజా జీవనంలో నిజాయితీని బహిరంగంగా సత్కరించడం మంచి ఆలోచనేనా అంటే 'అవును' అనె చెప్పాలి. నిజాయితీకి గాను రివార్డులందుకున్న ప్రజలున్నారు. ఎన్నికల కమీషన్ ప్రధానాధికారిగా ఉన్న శేషన్ ఆయన నిజాయితీకి గుర్తింపుగా 5 లక్షల రూపాయల అవార్డు బహూకరించడం నాకు గుర్తుంది.

ప్ర: అవినీతిలో 'బంధుప్రీతి' కి సంబంధించిన అంశం గురించి వివరిస్తారా?

జ: అది చాలా ఉంది. అవినీతికి గల సామాజిక మూలాల గురించి నేనొక వ్యాసం వ్రాసాను. అందులో, మన సమాజం కుటుంబం, విస్తృత కుటుంబమైన కులంపై ఆధారపడి నడుస్తోందని వివరించాను. నేడు మన దేశంలో, రాజకీయాలు మొత్తం అంతా కులంపై ఆధారపడి నడుస్తున్నాయి. 'మనం మన ఓటు వేస్తున్నాం, ఒక కులానికి వేస్తున్నాం'! కులం విషయానికి వస్తే, తమ-కులంవారు ఏదయినా చేస్తే, దాన్ని సహించడానికి సిద్ధమవుతున్నారు. ఢిల్లీలో ఒక ఐఎఎస్ అధికారిపై సిబిఐ వారు దాడిచేశారు. ఆయనవద్ద 14 కోట్ల రూపాయల ఆస్తుల్ని గుర్తించారు. ఈ సందర్భంగా అదే కులానికి చెందిన మరో అధికారి మీరు మన కులానికి చెంది కూడా మీ స్థానాన్ని ఉపయోగించుకుని సమర్ధవంతంగా డబ్బు చేసుకోవడం తెలియక పోతే ఎలా?-అంటూ వ్యాఖ్యానించారు. మన విలువలే ఇలా ఉన్నాయి. ఇందులో బంధుప్రీతి, కులతత్వం ప్రధాన పాత్ర వహిస్తున్నాయి.

ప్ర: జనాభా పెరుగుదల కూడా మనం పరిష్కరించవలసిన సమస్యలలో ఒకటి అని మీరు భావించడం లేదా?

జ: జనాభా నియంత్రణ మన దేశంలో పరిష్కరించవలసిన ప్రధాన సమస్య అన్న వాదాన్ని అంగీకరించలేను. ఈ విజ్ఞాన ఆర్థిక యుగంలో, జనాభా అనేది రెండు కారణాలవల్ల మంచి అవకాశంగా భావించాలి. ఇవాళ నేను ఎకనమిక్ టైమ్స్‌లో అరుణ్‌మెహతా వ్యాసంలో భారత, చైనాలకు గల జనాభా ప్రయోజనాల గురించి చదివాను. జనాభా సమస్య గురించి మాట్లాడినపుడు-మరి తమిళనాడు, గుజరాత్, కేరళల పరిస్థితి ఏమిటి? అభివృద్ధి చెందిన రాష్ట్రాలు, జనాభా పెరుగుదల సమస్యను పరిష్కరించుకోగలుగుతున్నాయి. ప్రభుత్వ శాస్త్ర సాంకేతిక విభాగ కార్యదర్శి ఒకరు రాసిన వ్యాసంలో మనం ఇప్పటికే జనాభా పెరుగుదల సమస్యను పరిష్కరించుకున్నామని పేర్కొన్నారు. జనాభా సమస్య గురించి మనం చర్చించేటపుడు-జనాభా సాంద్రత రిత్యా మాట్లాడడం సమంజసంగా ఉంటుంది. జపాన్, తైవాన్, బ్రిటన్ వంటి దేశాలలో ఒక చదరపు మీటరుకు జన సాంద్రత మన దేశంలో కంటే ఎక్కువే.

జనాభా నియంత్రణను తీవ్రంగా చేపట్టిన తమిళనాడు వంటి రాష్ట్రాలు రాజకీయంగా నష్టపోయాయి. అలాగే నియోజకవర్గాల పునర్విభజనవల్ల జనాభాను నియంత్రించని బీహార్ రాష్ట్రాలు, పార్లమెంట్ స్థానాలను పెంచుకోగలుగుతాయి. ది హిందూలో నేనొక వ్యాసం రాసాను- భారతదేశంలో జనాభా నియంత్రణ వంటి మన విధానాలు విఫలమయ్యాయి. ఎందుకంటే మనం 'వైఫల్యాలనే' సత్కరిస్తాము-అని! జనాభా నియంత్రించాలి-అని మీరు-కోరుకుంటే- జనాభా నియంత్రించని వారికి మీరు రివార్డులు ఇవ్వకూడదు! ఉత్పాదకత పెంచడంవల్ల, సరైన విధానాలను అవలంభించడం వల్ల ఈ సమస్యను మనం ఎదుర్కోగలుగుతాం!



*Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkadapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao*



VEEKSHANAM
TELUGU FORTNIGHTLY
1070 NAGARJUNA NAGAR